# శ్రీరామజననము

గ్రంథకర్త

సోమరాజు రామానుజరావుగారు

ప్రకటనకర్త

కందుల గోవిందం

బెజవాడ, కృష్ణాజిల్లా.



మొదటికూర్పు 1000.

కాకినాడ.

స్కేప్ అండ్ కో., లో కే. సుబ్బారాయ సోదరులచే

ముద్రింపఁబడియె.

1925.

 [వెల రు. 0—12—0

# విజ్ఞాపన



శ్రీరంగూన్-ఆంధ్రజాతీయనాటకసభాధికారులగు శ్రీవెలగల వేంకటరెడ్డిగారి ప్రోత్సాహమున, నేను రచించిననాటకములలో నిది రెండవది. నారామాయణనాటకములలోనిది మొదటిది. ఇదియంత పెద్దదిగాక, మిగులఁ జిన్నదిగాక తగువిధంబునఁ బ్రదర్శనయోగ్యముగ నున్నది. ఈనాటకము బ్రహ్మదేశమున, రంగూన్ మున్నగు పురములం దనేకసార్లు ప్రదర్శింపఁబడి మిగుల వన్నెగన్నది.

ఇందలి పాటలను ప్రస్తుతము బెజవాడ మైలవరం నాటకసభయందును, అప్పుడు రంగూను ఆంధ్రజాతీయసభయందును పని చేయుచుండిన, శ్రీఅలుగులపాటి రామానుజులుగారిచ్చిన స్వరములపై వ్రాసితిని.

రంగూన్‌పురమున నాచే రచింపఁబడి యనేకసారులు ప్రదర్శింపఁబడిన, నానాటకముల నన్నిటిని శ్రీకందుల గోవిందముగారు ప్రకటింపఁబూనుకొన్నందులకు వారికి నేను కృతజ్ఞుఁడను.

విధేయుఁడు,

సోమరాజు రామానుజరావు.



# ఇందలి పాత్రలు

—॥ పురుషులు ॥—

1. దశరథుఁడు.
2. మాతలి.
3. నారదుఁడు.
4. వృద్ధముని.
5. మునిబాలుఁడు.
6. శంకరుఁడు
7. వశిష్ఠుఁడు.
8. సుమంతుఁడు.
9. ఋష్యశృంగుఁడు.

కొందఱు వేటకాండ్రుకూడ వత్తురు.

—॥ స్త్రీలు ॥—

1. కౌసల్య.
2. కైక.
3. కావేరి.
4. మధుర.
5. నీలవేణి.
6. కనకాంగి.
7. లలిత.
8. మునిపత్ని.
9. పార్వతి.



# శ్రీ రామ జననము.

## ప్రథమాంకము.

రంగము:—దేవాసుర యుద్ధభూమి

(ఒకభాగమున విశ్రాంతుఁడై మూర్ఛిల్లినదశరథుని నున్నరథముఁ గొలుచు కైక ప్రవేశించును)

### అనుబంధము 1

కైక—(దశరథుని లేపు చూచు) నాథా! దశరథరాజేంద్రా! శత్రువులు దూరమం దున్నారు. నేను దేవర దేవేరినగు కైకను—నన్ను కన్నెత్తిచూఁడుము—

ఉ. దూరముగా రథంబు వడిఁదోలి యురాళిన రేఁదరిబాణ సం
చారము గానరా నిజ స్థలిఁ జేర్చితి ప్రాణనాథ! దు
ర్వైరిబలంబులారెను; సుపర్వుల కెల్ల ముదంబు చేరె; నీ
దారుణయుద్ధమందు జయదర్పము గాంచితి లెమ్ము నాయకా!

దశ—(లేచి) ప్రాణేశ్వరి! మనమిప్పు డెచ్చట నున్నాము? శత్రువు లేరి? సారథి యేడి? సరస్తీరముచుండి వెడలుచల్లని తెమ్మెరలు గల యీప్రదేశము రణభూమి కాదే!

కైక—నాథా! మనకింక శత్రుభీతిలేదు. ఏమనిన,

సీ. కదనభీభత్సరంగము దవ్వులన బాసె
రమ్యకాసారతీరంబుడాసె
అరిచమూయుతసమూహంబవ్వలకుఁ బారె
భవదీయసతి సమీపమునఁ జేరె
శాత్రవబాణసంచయమెల్ల హరియించె
నేణీదృగంబక శ్రేణి మించె
శత్రురాడ్భానుండు చరమాద్రిపైవ్రాలె
నాత్మసంతతవిజయాబ్ధిఁ దేలె
గీ. సురవిరోధియగు తిమిధ్వజుండు చచ్చె
ననదృశంబుగ సురలసంతసము హెచ్చె
విబుధభూమిని దనుజులు విడువనయ్యె
భూరితరజైత్రయాత్ర సంపూర్ణమయ్యె.

తిమిధ్వజుం గూలనేసి తమరు రథంబుపై మూర్ఛాగతులరై యున్న సమయంబున నొక్కనిశాటాధముఁడు దొంగపోటునవచ్చి మన సారథింజంపి మిమ్మువధింపఁబోవునంతలో తమచేతిలోనిధనుర్బాణములను నేను ధరించి యాదనుజుం దుంచి రథంబు నిట్లు రణభూమిం దొలంగించుకొనివచ్చితిని. ఈలోనఁ దమప్రభునిచావునెఱింగి దానవబలంబు లెందో పారినవి.

దశ—(వాత్సల్యముతో ముద్దిడుకొని) చెలీ! కైకా! నీవు నేఁ డొనరించిన నాప్రాణసంరక్షణమునకు నీకీముద్దుతప్ప బహుమానమింకేమీయఁగలను?

కైక—(లజ్జతో) అది నాకుమాత్రమే బహుమానమెట్లగును? తచ్చుంబనసౌఖ్య మిరువురకును సమానమేకదా?

దశ—నిజము చెప్పితివి! నిజమే కాక ప్రస్తుతస్థితిలో నిది నీకుఁ గాక నాకే విశేషించి యానందజనకమయ్యెను.

గీ. విమతశరహతమాశరీరమునకిపు డ
నంగసుఖమిడ నీసదాలింగనంబు
అంతతాపులమంటలనణఁగించె
సుఖకరంబైన నీముఖచుంబనంబు.

(అని మఱియొకసారిముద్దుపెట్టుకొనుచున్నాఁడు.)

కైక—(అభిమానలజ్జలతో) నాథా! ఇట్లు వెండియు మీరాద రించుటచేత నాకు మఱియొకమాఱు ఋణపడితిరి.

దశ—ఆఁ, అర్థికోటులను చాలుననిపించిన దశరథుం డర్థాంగి కృణపడునా! ఓ ప్రేయసీ!

కం. సరసిజలోచన! నీకీ
తరి ఋణపడితినటంచుఁ దలఁచితివి గదా
వరములనర్థింపుము! నీ
కిరవగునవిగాగ రెంటి నేయవియైనన్.

కైక—నాథా! నాకీయకారణవరములేటికి? పరిహాసమునకాడితిఁగాక! నాకు మీరఋణపడుటేమిటి? ఈతన్వంగివంచప్రాణములును మీయవి కావే?

దశ—వలదు! ప్రేయసీ! వలదు! పరిహాసమునకే కానిమ్ము! నేను నీకు లొంగిపోవుదు ననుకొంటివా? ఇంతే కాక నీవు నేఁడు నాకొనరించినసహాయము మనుపమానముగదా! చూడు!

(అనుబంధము 2)

సీ. పికరవంబులకెద భీతిఁజెందెదవీవు
దానవార్భటికెట్లు తల్లడిలితొ!

పూలుగుచ్చిన కందిపోవు నీచేతులు
శరము నేగతిఁ గూర్పఁజాలెనొకో,
ఉద్యానయానంబు నొనరింప వెరతువు
కదనరంగం బెట్లు గడచినావో
చిలుకకు గీతముల్ జెప్పి తాళగ లేవు
సింహనాదం బెట్లు చేసినావొ!

గీ. అంబుజవిలోచనల సహాయంబు లేక
కదలనేరవు—రథమెట్లు గడపినావొ!
కడుశ్రమం బందినావు నాకారణమున
నీఋణము దీర్చుకొనుటెట్లు నీరజాక్షి!

అందుచేత నాహృదయపూర్వకంబుగ నీ కీరెండువరంబుల నిచ్చుచున్నాను. నామనంబు చిన్నబుచ్చక కోరుకొనుము!

కైక—నాథా! భవదనుగ్రహంబున నాకు సకలసౌఖ్యంబులు గలుగుచుండ మిమ్ముల నేవరంబుల కోరుకొందును? అయినను తమ యాజ్ఞతప్పనిదిగావున నాకువలసినప్పుడావరంబులఁ గోరుకొందును. అట్లనుగ్రహింపుము!

దశ—ప్రియసీ! అట్లేకానిమ్ము! ఇప్పుడుగదా కృతకృత్యుఁడనైతిని.

చ. నలువురుపిన్నపెద్దలు మనంబునరోసిన రోయనిమ్ము; బం
ధులుం, హితు, లాప్తకోటులును దూరిన దూరగనిమ్ము; పిత్రువ
త్సలుఁడగుపుత్రుఁ డుగ్రవనసంతతి జేరగనిమ్ము; జీవమే
గడచినబోవనిమ్ము; కలకంఠిరో! నీవరయుగ్మమిచ్చెదన్

(తెరలో)

తథాస్తు. అట్లే యగుఁగాక!

దశ — (విని) ఆ! ఏమిది! నానోటనిట్టియ శీలము వెలువడుటయు ... డన సుగుపశ్రుతియునా? హా! నావామనేత్రి మేటికిట్లదరుచున్నది!

అనుబంధము 3

(మరల తెరలో)

తథాస్తు. అట్లే యగుఁగాక!

సురసహాయార్థమే తెంచిన దశరథునకు శుభమే యగుఁగాక! మాతలీ! నీవు శీఘ్రముగా జని యారాజేంద్రునకు నాసందేశమును విన్నవింపుము.

కైక — నాథా! ఈ దేవాసుర యుద్ధమునందనకు సహాయముం గావించి తిమిధ్వజుని గూలించినమీకు తనకృతజ్ఞతం దెలుప దేవేంద్రుఁడు మాతలి నిందు పంపుచున్నాఁడు.

దశ — హృదయమా! వేగిరపడకుము! ఇది కేవలము కాక తాళీయముగు నుపశ్రుతి.

(తరువాత మాతలి ప్రవేశము)

మాత — భూలోకసార్వభౌముఁడగు దశరథరాజేంద్రున కభివాదనము.

దశ — మహేంద్రసారధికి మాతలికి స్వాగతము.

మాత — దేవా! సురనాథుండగు దేవేంద్రుఁడు నీకీసందేశమును విన్నవింపుమనియె.

దశ — ఎట్లు?

మాత —

సీ. అష్టదిక్పాలురయధికారములు నేఁడు
నీదయాదరసమున నిలిచెననియె
కల్పకంబును కామగవియుఁ జింతామణుల్
భవదీయభుజశక్తి బ్రదికెననియె

ప్రముఖరంభాద్యప్సరఃకాంతలెల్లరు
తావకశరబలాధారలనియె
విబుధలోకంబు దేవేంద్రాదివిబుధులు
నీనీడ నెప్పుడు నిలతురనియె

గీ. నమరపితలగు నదితికశ్యపులు నీకు
వివిధశుభములు గలుగ దీవించిరనియె
విష్ణుసములగు సుతులుద్భవింతురనుచు
దివ్యులెల్లరు నాశీర్వదించిరనియె.

దశ—అమరులయాశీర్వచనములను శిరంబునందాల్చితిని. మాతలీ! నాపలుకులుసయిత మాశతక్రతునితో విన్నవింపుము!

మాత—అవహితుండనై యున్నాను.

దశ—

చ. సురలను భూసురోత్తముల సుందరులన్ మరియార్తకోటులన్
చిరముగ నాలసంతతుల చింతలుబాపుట రాజధర్మముల్
సురవర కాన సంగరముంజొచ్చితి నావిధిందీర్చుకొంటి నీ
కరుణకు నేనొనర్పందగుకార్యము లేదు ప్రణామమొక్కటే.

మాత—అట్లే. వచించెదను. బుద్ధిమంతులెన్నడును నితరుల కృతజ్ఞతం దమపై నుంచుకొందురుగదా? మహారాజా! మీరు భూలోకంబునకుం జనకపూర్వము నందనోద్యానచిత్రంబులంజూచికల్పకమందారసంతానపారిజాతంబుల నీడల నించుక విహరించి పోవలయునని మాదేవేంద్రుని ప్రార్థన;

దశ—మాతలీ! ఇది ప్రార్థన యెట్లగును? కేవల మిది మాకనుగ్రహము కాదా! మీకింతకన్న నేమి కావలయును? అట్లే కావింతుము; పోయిరమ్ము.

మాత—మహాప్రసాదము;

దశ——ప్రియసీ! గొప్పవారిసందర్శన మూరకే పోదుసుమా!

గీ॥ దనుజవిభుద్రుంచినంతమాత్రంబుచేత
నందనోద్యానఖేల నానందపదము
జిష్ణుసమనుత సంభవాశీర్వచనము
ఘనతరానందము నందఁగంటినబల!

ఇప్పుడు నామనం బమితానందంబు నందుచున్నది వేగముగ నందన వనంబున కేగుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము.

### కోసలరాజ్యమున నొకయడవి.

(కొందఱు వేటకాండ్రతో ధనుర్బాణములు ధరించిన దశరథుఁడు ప్రవేశించును)

దశ——శబరులారా! ఈప్రదేశము కడునిరుకైనది. మీరందఱు నావంకకుఁబోయి వేటాడుచుండుఁడు. నే నీసరయూతీరమునం గల మృగములం బరిమార్చెద.

శబ——చిత్తము (నిష్క్ర).

దశ——(తనలో) ఏకారణముననో నాకీదినమున మిక్కుటమగు మృగయాతృష్ణగలుగుచున్నది. ఈప్రాంతంబునం గలహరిణభల్లూకశార్దూల గజసింహాశరభాది వనజంతుసంతానమెల్ల సంహరింపఁబడియె ఇప్పుడు లెక్కకొక్క మృగంబైనను గాన్పించుటలేదు! అహా! వేటతమకంబునంబడి పొద్దు తెలియనైతిని. అప్పుడే సూర్యాస్తమయమై గాఢాంధకారము రోదసీకుహరమునం దెల్ల నతిసాంద్రముగ వ్యాపించినది.

సీ. బ్రహ్మాండమను పాట్టారంగస్థలంబున
దింపిన నల్లని తెరయనంగ
పతిగాంచు నెడ లజ్జపడలని కామినీ
ముదిత ధరించు మేల్ముసుంగనంగ
ప్రళయభైరవరూప, ప్రకృతి దిద్దినయట్టి
నల్లని మంజుధమ్మిల్లమనఁగ
రేయి లోకపుఁ గన్నుమూయింప నీశ్వరుం
డలఁదిన కాలాంజనాప్తియనఁగ
గీ. కాలపురుషుండు లోకరక్షణము సేయ
కోటకుఁగూర్చిన నల్లనిగోడగనంగ
గగనభూతలమధ్యభాగంబులందు
నంధకారము బ్రహ్మాండ మాక్రమించె.

ఈయామినీవేళలయందు దుష్టమృగములు జలాపేక్షచే ప్రాయికముగా నీసరయూతీరమునకు వచ్చుచుండును. కావున నాయశోక వృక్షపార్శ్వమున వేచియుండి మునిజనంబులకు హానిగల్గించు నీదుష్టమృగంబుల గీటడంచెదను (నిష్క్రి)

(తరువాత నొకమునిబాలుఁడు ఘకనుండలుఁడై ప్రవేశించును)

ముని—(తనలో)

(అనుబంధము 4)

ఉ. కన్నులు లేక వార్ధకతగాసిలుచుండెడు తల్లిదండ్రులన్
మన్ననఁజూచి దైవతసమానముగాఁ బరిచర్యఁ జేసి, మృ
ష్టాన్నము పానమిచ్చి, తినినంతట నెంగిలినాకి, పాదము
ల్గన్నులకద్దుభాగ్యమది కల్గదుగా భువి నెంతవారికిన్.

పురాత్కృతమగు పుణ్యవిశేషంబునఁగదా వృద్ధమాతాపితలకు పరిచర్యఁ జేసికొను మహాద్భాగ్యమబ్బె! లోకంబున మానవులకు మా

తాపితలకన్న పరదైవములు లేరని యెఱుంగని నరులిట్లేకదా పితరుల బలువంతల పాలుసేసి, తా మంతకుని పాలగుచురు. ఓహో! నేను లోక వృత్తాంబునంబడి ప్రకృతంబు మఱచితిని. పవిత్రమైన యీసరయూజలంబులం గొని చని పూజ్యులగు వృద్ధమాతాపితలకు సాయంకాలకృత్యంబులం దీర్చెదను. (కొంతదూరము చని) ఆ! ఏమిది. నాపాదము లేకారణమునకో ముందునకు సాగుటలేదు. మరణాసన్నునకుంబోలె శరీరమంతయుఁ బ్రకంపమానముగుచున్నది. అవునుగదా! మర్త్యజన్మమెత్తినవాని కనుక్షణమును జీవనములు పిడికిటనుండవలసినదే.

గీ. నరుఁడు భవితవ్యమును గానంబుఁ జేసి,
తాను చిరజీవియనిమదిఁ దలచుచుండు
వెనుకదెస మృత్యుమాత్రంబు వెక్కిరించు,
నేను మృతిగాంచుటరయంగ లేఁడు నరుడు.

కానిమ్ము. కాఁగలదాని నెవ్వఱుం దప్పించుకొనలేరు. శీఘ్రముగ జలసేకరమునకై జనియెద.

(నిష్క్రమించును)

(తరువాత ధనుర్ధరుఁడగు దశరథుఁడుఁ బ్రవేశించును)

దశ — ఓవనమత్తేభమా! విలుకాలు పారిపోకు,

చ. వెరపొకయింత లేక వనవీధిని స్వేచ్ఛఁజరించుచుండి భీకరముగ పాంథకోటులను గారియఁ బెట్టెదవా గజాధమా
పరచెదవేల తీవ్రకరవాలము పాలొనరింతుజూడుమీ
ధరణిజనాళినింక శ్రమదార్కొనకుండ సుభం బొసంగెదన్.

ఏమిది! ఈమత్తేభంబింతలో నెచట నదృశ్యమయ్యెను? ఈకొండదరియచెంత నన్ను మోసగించియుండో చనినదగదా?

(తెరలో బుడ, బుడ, యనుధ్వని.)

దశ—(విని) అదిగో గజమెందునుఁ జనలేదు! అంధకారమునం గన్నుగానక, నేనే భ్రాంతుఁడనైతిని—నిజము

క. బుడబుడమనియెడుధ్వని విన

బడియెన్ సరయూతరంగమధ్యమునందున్

కడువడి నీమదగజమును

బడనేసెద నొక్కతీవ్రబాణముచేతన్.

(బాణమువదలుచున్నాఁడు)

(తెరలో హా జననీ జనకులారా? చచ్చితి చచ్చితి.)

దశ—(నివ్వెరపడి) ఆ! మృగయాఖేలనతత్పరమైన నాబాణమే నిరపరాధులపైనెన బడియెనా యేమి! ఇది బాలక కంఠస్వరముంబోలినాకు గర్భనిర్భేదమై వినఁబడుచున్నదే! అదియునుం గాక నీదుర్నిమిత్తములకేమనవలయు.

చ. తనువుప్రవడంకఁజొచ్చె, శిరముదార్కొనె, మోమునస్వేదబిందువుల్

బెనఁగొనె దుర్నిమిత్తములు భీకరవైఖరిఁదోఁపఁ జొచ్చెనె

మ్మనమున నాశదంబగునమంగళమేదియొవచ్చురీతిదో

చెను శరవంక్తిజారెనిరుచేతులనుండి తమంతధారుణిన్.

(మరల తెరలో)

హా పరమేశ్వరా! కన్నులులేని నావృద్ధమాతాపితలకేదారి జూపితివి? దిక్కులేని పక్షులగతి, క్షుద్బాధాపిపాసలచే నీయరణ్యమున వారింజావవ్రాసితివా? తమ ప్రాణములనన్నిటిని నొక్కడనే కుమారుడనయిన నాయందు నిలిపి జీవంబుగడుపుచున్న యానిర్భాగ్యదంపతులు నామరణవార్త విని జీవింతురా? ఓ రాజా! నిరపరాధినయిన నేను నీకేమి పగగావించితిని? త్రాకికవ్యాపారంబులపాలిఁటికింబోక ప్రశాం

తమయిన యీతపోవనంబున నివసింపుచు కన్నులులేని తల్లిదండ్రుల కిన్ని పండ్లిడి, నీరుపోసి, పోషింపుచు, నారాయణస్మరణంబున కాలంబు గడుపుచున్ననాకే నీదండనము తప్పినదిగాదే ! ఇంక లోకంబున నెవ్వ రు దుష్టజనులబాధలకు గురికాకుండనుండఁ గలరు? ఒక్క బాణంబున ముగ్గురిప్రాణంబులఁ దీసితివిగదరా రాజాధమా—(ఆక్రందించుచు న్నాడు)

—(ఆలకించి)—

దశ—అకటా ! ప్రమాదమే సంభవించినది. ఈతండొక మునికుమారుండు. వృద్ధమాతాపితలకు జలంబు గొనిపోవ నిందువచ్చి యుండును. నేనుదాని నెఱుంగక మునిబాలుంజంపి మహాపచారంబు సల్పితిని. ఇప్పుడేమిచేయువాఁడను? ఏదిమార్గము? ఏమి కానున్నదో తెలియదయ్యెను. నాకీనాఁడు వేటాడు పాడుబుద్ధి యిందులకే కలిగెనా? ఆబాలునియొక్కొక్కవాక్య, మొక్కొక్కశూలమై నామనస్సును బాధించుచున్నదే! తీవ్రమగు విప్రశాపమునకుఁ బాల్పడుదును గాఁబో లును గా దైవమా!

చ. వ్యసనములంచు పెద్దలు చివాట్లను పెట్టెడు చెడ్డదారికిన్
వశమయి యున్నటంచు మునిబాలుని పూజ్యుని జంపినాఁడనె
క్కసముగ నెట్టి శాపమికఁ గల్గెడునో మునివృద్ధుచేతన
ద్యశమును గోలుపోతి నకటా ! యికరాజ పదంబు కాల్పనే.

(దగ్గఱకుఁ బోవుచున్నాఁడు)

{ తరువాత శరబాధితుఁడగు ముని బాలుఁడు కనఁబడును }

ముని—హా! పరమేశ్వరా! మాముగ్గురి మరణంబులకుం గార ణంబుగా నీ రాజాధముని వేటకల్పించితివా దేవా —

దశ—(పాదములపైఁబడి) మహాత్మా! రక్షింపుము రక్షింపుము.

మ. వనమత్తేభహారభ్రమాకుల ఖలస్వాంతంబునం గానలే
కనఘా నన్మునిపుత్రుఁ గూల్చితి మహాత్మా నన్ను రక్షింపు
ముని భా—హా
జననాథా దశదా మునిపుత్రకరముం జంపంగ నుంకింతు నా
చను నే, యీదురితంబు నాయెడల రాజద్రోహచండాలుఁడా.

దశ—దేవా! అపరాధం బొనరించితి. ఎఱుఁగక చేసినయీతప్పు గావవలయు. నిరంతరసాధుసంరక్షణదీక్షాపటిష్ఠంబగు మదీయశరంబు నాదురదృష్టంబున గాక, తాదృశ, సాధుజనంబుల నేచఁ జనునే! ఇక్ష్వాకువంశోత్పన్నులగు రాజోత్తము లింతకుమున్ను గోబ్రాహ్మణబాలాబలావిలాపంబులకు తమరాష్ట్రంబున నెడమిచ్చి యెఱుఁగరు. నేఁడుమాత్రి మీదశరథుఁడు. బుద్ధిపూర్వకంబుగానిట్టికట్టడి కాగ మేల గావించును.

ముని—ఏమీ సూర్యవంశప్రదీపకుండగు, దశరథభూనాథుని కతంబుననా నేను వధింపఁబడితిని. రాజా! నీకిదేమి దుష్ప్రాప్తి! మీవంశీయులు సదాచారసంపన్నులు గదా!

దశ—

మ. అనఘా యేమని విన్నవించెద! మదీయంబైన దుష్ప్రాప్తి ధీ
జనగర్హ్యంబ యదృష్టమైన మృగయాసంచారదుర్బుద్ధిగాం
చినచిత్తంబు మరల్పలేక ఘనమందేహభ్రమంగాంచి నీ
తనుజుంగూల్చితిమందబుద్ధి నపరాధంబింక మన్నింపవే?

ము-భా—రాజా! నీవింతగాఁ బ్రార్థింపఁజనదు. నావిధికి నీ వేమి చేయఁగలవు? భగవంతుఁడు, నాకొనటనిట్టి చావు లిఖించియుండ

నెవ్వరు తప్పింపఁగలరు; నాప్రాప్తికి నీవు గానిచో వేఱొకరాజేంద్రుఁడయిన గారణమై గావలయుంగదా, నీవలన నాకుఁ గావలసిన దొక్క మహోపకారముగలదు; గతంబుమఱచి నాకాయుపకారంబొనరింపుము.

దశ—(ఆత్రముతో) మహాత్మా! ఆజ్ఞాపింపుఁడు. అది యెట్టి కార్యమైనఁ బరిపూర్తి నందింప నీదాసుఁడు సిద్ధముగానున్నాఁడు.

ము-బా—మహారాజా!

ఆ. కనులు లేక పుత్రకా పుత్రకాయంచు
నన్న లోకమంచు నెన్నుకొనెడు
కానలోని దిక్కు లేని నా పితలను
గాంచి చావకోర్కెఁగలదు తండ్రి.

పుత్రవత్సలులగు తల్లిదండ్రులం జూచుదనుక ప్రాణము లీశరీరమును విడచునట్లు లేదు. రాజా! ఇచ్చటకు తూర్పుదిశగా నర్ధక్రోశము నడచితివేని యచ్చట నొకవిశాలమగు మఱ్ఱిచెట్టును దానిక్రింద నొకపర్ణశాలయు, నయనగోచరంబులగును. నన్ను వేగముగఁ గొనిపోయి వారి కన్నులఁ బడవేయుదువేని నాయాత్మ సంతోషముగ నీ భూమిని విడచిపోవును. అక్కటా! శరబాధ శరీరమంతయు భగ్గుమండించుచున్నది. ఏమిచేయుదును రాజా! త్వరపడుము. హా! తల్లిదండ్రులారా! హా పరమేశ్వరా! (మూర్ఛిల్లును)

దశ—(విచారముతోఁ దనలో) హా విధీ! నన్నామునిశార్దూలము నెదుట సయితము వైచెదవా? అతఁడు పుత్రశోకాతురుఁడై నావంశంబెల్ల భస్మీపటలంబగునట్లు శపింపఁడా?

చ. హరనయనప్రచండవిశిఖాహతి కన్నను తీక్ష్ణమైన దు
ర్భరముని శాపకీలలకు భస్మముగాఁ జనుచున్నవాఁడ హో హరిహరు
లార! దైవతవరాంబుజసంభవులార, కావరే

ధరణీనభంబులాగ సముదారత నాత్మకు లేంద్రభానుడా.

(అనుబంధము 5)

(బాలునితో విమ్రమించును.)

---

(తృతీయరంగము)

(మునిపల్లెలోన వృద్ధదంపతులు ప్రవేశము)

అనుబంధము 6.

వృ-ము—దేవీ! నేడు మనస్సంతయు వ్యాకులముగానున్నది. జలముల కేగవలదని యెంత జెప్పినను వినక సుకుమారుఁడగు కుమారుండు కమండలము గొని సరయూతీరమున కేగి యొకజాము కావచ్చినది. ఇంకను పుత్రుని జాడ కానరాదయ్యెనే? ఏమివిపరీతము సంభవించియుండును?

ము-వ—నాథా! నామనంబు నయిత మాందోళనముగనే యున్నది. ఏమెడరు గల్గునో తోచుటలేదు. యాగశాలలోని హరిణము నయిత మేశ్చుచున్నది. నిరంతర మారని యగ్ని హోత్రము వెలుంగు ధ్వనియు వినంబడుటలేదు. మన కా యొక్క కుమారుండు గాక ప్రపంచమున వేఱేమియున్నది?

వృ-ము—ఓ పరాత్పరా! నా యేక పుత్రుని రక్షింపుము.

గీ. అత్యగాధజలంబు పాలగునుగాక!
యుజ్వలంబగు శరబాధనొందుఁగాక
అసువులే వీడుటకు తెరియగునుగాక
యీశ్వరా! నాదుసుతుని రక్షింపుమయ్య.

ము-వ—అశ్లీలము ప్రతిహతంబగు గాక! నాథా! ఏమి యిట్లు పల్కుచున్నారు?

వృ-ము.—ప్రాణేశ్వరీ! నేనిప్పుడేమన్నాను,

ము-ప.—కుమారుని దీవించవలదంచిన మీనోట న కారణముగ శాపవాక్యములు వెలువడినవి.

వృ-ము.—హా పరమేశ్వరా! శతృవునిపట్ల నయితము దురితము లాడని నానోట పుత్రుని పట్లనే శాపవాక్యము వెలువడెనే! ఏ శాకినై చనిన నాకుమారున కేకీడు గల్గునో కదా.

(మునికుమారునితో దశరథుడు ప్రవేశించును)

అనుబంధము 7.

దశ.—హా శే! మునిదంపతులు. వీరింగాంచిన నాశరీరమంతయు గడగడవడంకుచున్నయది. ఈ బాలుడు నయితము మార్గాగతుడై యున్నాడుగదా! ఏమిచేయుదును? బాలు నిందుదింపి నిజము వచించి వారి పాదములపై బడెదను. (అట్లు చేయుచున్నాడు)

ము-ప.—నాథా! కుమారుడు వచ్చిన ధ్వని వినబడుచున్నది కాని దూరమునుండియే మాటాడు పుత్రుడు నేడేల మాటాడకున్నాడు?

వృ-ము.—పుత్రకా! పుత్రకా!

ఉ. దగ్గఱగమ్ము తండ్రి యతిదారుణపుత్రవియోగబాధచే
బెగ్గిలుచున్న నీపితల వృద్ధుల గావుము, నావలోన నె
ట్లగ్గలమందినావొ తనయా నినుచిత్తమునందలంపగా
గగ్గురుపాటుగల్గె తిమిరంబు హరింపగ ముద్దొనంగుమా.

నాయనా! దగ్గఱకైనను రావేమి? అనుదినంబును. నానందమున మాటాడుచు నాహారంబు దినుపించు నీవు మాతో నేల మాటాడవురా! తండ్రీ!

దశ— ఆహా! వీరిశోకంబున కేమనవలయు ? ఇట్టిపుత్రవాత్సల్యముగల దంపతులతోడ మీకుమారుంజంపితినని పలికినతోడనే నావంశక్షయమగునట్లు శపింపరా! అకటా! నాకేదారియుందోచుట లేదు. ఏమిచేయుదును! ఈమునిబాలకుండైన నింకను లేవడయ్యె. నావృత్తాంతమును వెల్లడింతునా!

వృ-ము— సతీమణీ! ఇతఁడు మనపుత్రుఁడుగాదోచదు. పుత్రుఁడేయైన సంభాషింపకుండునా? ఎవ్వఁడో యొక్క కపటి మనకుమారుం జంపెనో కాక మనలఁ జంపుటకో యిందువచ్చియుండనోపు.

ము-ప— హాకుమారా! ఎక్కడనున్నావురా! తండ్రీ!

వృ-ము— ఓరి కపటశీల! నాకుమారుం డెక్కడరా? నీవెవ్వఁడవో తెలుపవేని భస్మమగురీతి శపించెదను చూడుము.

దశ— (భయము) ఓమునిదంపతులారా! పాహిమాం పాహిమాం.

వృ-ము— ఎవఁడవురా నీవు?

గీ. అనఘ కోసలమందయోధ్యాపురంబు
నేలు దశరథనాముఁడ నినకులంబు
జెరుపఁబుట్టితి నీశ్వరచింతనులయి
నట్టి మీగర్భమునఁ జిచ్చు బెట్టినాను.

మహాత్ముల యెడ నగ్గుగావించిన యీపాపి మీసమీపముననందే యున్నాఁడు. తావక శాపాగ్నిచే నన్ను దహించి పాపముక్తుం జేయుము దేవా!

వృ-ము— ఓరి ద్రోహీ! నాయెడలనీవపచారమొనరించుటేమి! నాపుత్రుఁడెచ్చటరా పాపీ?

(అనుబంధము 8.)

ముని ప—హా! కుమారా! నీ కేకీడు మూడినదో కదా తండ్రీ!

దశ—దేవా! క్షమింపవలయు. తమ కుమారుని శరీరము తోడనే వచ్చియున్నాను.

ముని, ప—హా కుమారా! చచ్చితివి రా?

వృ, ముని—హా! హా! ఏమి? నా కుమారుఁడుగాదా? నా కుమారుని శరీరమా? ఏమి? రాజా! మమ్మింకను తెగనికత్తిచే నేలఁ జంపెదవు నా కుమారునెట్లు చంపితివో చెప్పుము.

దశ—మహాత్మా! రక్షింపుము యెఱుఁగక జేసితిని.

మ. అఘా యేమనివిన్నవించెద మదీయుంబైన దుష్ప్రాప్తిధీ
జనగర్వ్యంబయి దుష్టమైన మృగయాసంచార దుర్బుద్ధి గాం
చినచిత్తంబు మరల్ప లేక ఘనమందేభ భ్రమంగాంచి నీ
తనయున్ గూల్చితి పాపబుద్ధి నపరాధంబింక మన్నింపవే.

(మూర్ఛిల్లును.)

వృ. ముని— } హా పుత్త్రకా!
ముని. ప— }

దశ—హా! పరమేశ్వరా! నాకేటికి నేడిట్టి కష్టకవాటముం దెఱచియున్నావు.

ముని. బా—(లేచి) రాజా మనమెచ్చటనున్నాము. నాతల్లిదండ్రులెక్కడ?

దశ—దేవా! మీ తల్లిదండ్రులకడనే యున్నాము. పిట్టపిడుగుఁ బోలిన యీవార్తవిని వారల్లదే మూర్ఛిల్లియున్నారు.

ముని. బా—అహా! పాపాత్ముఁడనగు నా కారణమున నాతల్లిదండ్రులకట్టిదుస్థితిగలిగినది రాజా! వారితో నెల్ల వృత్తాంతమును వచించితివా.

దశ—అయ్యో! వినియే మూర్ఛిల్లినారు.

వృ-ము— } హా! కుమారా! హాకుమారా!
ము-శ— }  (ఆక్రందింతురు.)

ము-బా—అమ్మా! నాయనా! నమస్కారము! మీకు పుత్ర శోకముం గల్పింపఁబుట్టిన మీకుమారుఁడింకను మరణింపలేదు! హా! తల్లిదండ్రులారా! దిక్కులేనివారలైతిరా?

సీ. కన్నులుగానరాకున్న వృద్ధులను మి
మ్మింకఁగాపాడువారెవ్వరయ్య
తల్లి దండ్రి యంచు తడయక మీకార్ష
హితవిధిఁదీర్చు వారెవ్వరయ్య
ఆకలివేళనాహారంబు నొసఁగ
దించువారింక మీకెవ్వరయ్య
ఘనజరాభారసంగతి కుఃచర్య చే
నెవ్వగఁ బాపువారెవ్వరయ్య
గీ. అఖలసంధ్యల పితృసేవలాచరించి
యింకదీవసలందు వారెవ్వరయ్య
చనిన వెనుకమీకు నివాపజలమువదలి
ఋణముదీర్చుకొనెడు వారెవ్వరయ్యా.

వృ-ము—కుమారా! మాకేమిదిక్కుచూపిపోయెదవు తండ్రి! తెక్కలువిరిగినపక్షులమయిన మేము నీవు గతించినవెనుక నీభూమిపై నింకను జీవంబులుదాల్చియుందుమా! తనయా! మమ్మును నీవెంటఁ గొనిపొమ్ము.

ము-ప—హా! తనయా! కడుపారఁగనిపెంచి కడుపుతీపి నెఱుంగని యొక కటికివాఁడగు రాజాధమునకు సిన్నర్పించితినిగదరా

తండ్రీ! ఇంక మాకేది దిక్కు. కన్నులుగానఁగాని మమ్మేపులియైన తన నోటవేసికొని పోవకమున్నె నీవెంటఁగొనిపొమ్ము నాయనా!

ము-బా—నాయనా! అమ్మా! యెఱుఁగక దోషముఁ జేసిన యీ రాజేంద్రుని నేలదూషించెదరు? నాకును మీకును నేటితో ఋణము దీరిపోయినది; నేనెఱుఁగక చేసినదోషములనన్నిటిని క్షమింపుడు. నాప్రాణములు పోవుచున్నవి కడసారి మీకొనరించు నాయభివందనములను పరిగ్రహింపుడు. భావిజన్మంబులయందును మీరే నాతల్లిదండ్రు లగునట్లు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను. మీరింకముం దేమయి పోవుదురోయను మహాదుఃఖమున మనస్స్థిమితములేక ప్రాణములం బాయుచున్నాను. తల్లిదండ్రులారా! మిమ్ములను పరమేశ్వరుఁడే రక్షించునుగాక! నాకు సెలవిండు. నారాయణ నారాయణ.

(ప్రాణములువదలుచున్నాఁడు.)

(అనుబంధము 9)

ము-ప—
వృ-ము } హా పరమేశ్వరా (మూర్ఛిల్లుచున్నారు.)

దశ—హా! దైవమా! నా నెత్తిపై నొక బ్రహ్మహత్య కట్టితివా?

వృ-ము—
ము-ప— } హా! కుమారా! మాగర్భమునం జిచ్చుపెట్టి మరణించితివా? నాయనా!

దశ—ఆహా! వీరి నేమని యోదార్పఁగలుగుదును.

వృ-ము—హా! తనయా! మాప్రాణములన్నియును నీ వేయని బ్రతికియున్న మమ్ము పాతాళమున కణగఁద్రొక్కి మాకడుపునఁ బుత్రవియోగాగ్నియు దరికొల్పి పుణ్యలోకమునకుం బోయితివా? కుమారా! చందనసమశీతలమైన నీమృదుశరీరాలింగనమును నీపరిచర్యలును నీముద్దుమాటలును మాకు నేటితోఁ బ్రాప్తముదీరిపోయెను

గదా! పుత్రా! మాయనంతర మిన్నితిలోదకంబులు వదలి మాకుత్తమ గతులను గల్పింతువని తలంచితిమి గాని నీకింతలో నూరేండ్లు నిండు నని కలలో నైనఁదలంపమైతిమి నాయనా! కార్చిచ్చువలెగర్భమంతయు దహించు నీకడుపుదుఃఖము మాకుతీరునట్లున్నదా నాయనా! నాయనా!

(ఆక్రందించుచున్నాఁడు.)

ము-ఋ—నాకన్నతండ్రి! పలుక వేమిరా! నేనునీతల్లిని నాయనా! యిటుచూడు! పుష్పసుకుమారమైన నీమృదుశరీర మింతలోనే కట్టెయై నిలువున లేచి వచ్చుచుంటివేమిరా! నాయనా! నిన్నింతలోనే మంటఁ గలుపుగొంటిమిగదరా కుమారా! అమ్మా! యివిగో పండ్లని నాకో టికందీయవేమి తండ్రీ! నామనస్సు చల్లనగు సల్లాపమాటయిన నాడుము కుఱ్ఱా! నేఁడీకటికనేలయే నీకు పూలపాన్పయినదా బాబూ!

దశ—ఓ పూజ్యురాలా. మీకుమారుని చావునకుఁ గారకుం డైన చెనటి యిచ్చట నేయున్నాఁడు. శపించి మీదుఃఖమును జల్లార్చుకొనుఁడు.

ము-ఋ—అయ్యో? నిన్ను శపించిన నాచిన్నతండ్రి బ్రతికి వచ్చునా? రాజా.

(శోకించుచున్నది)

వృ-ము—హా! రాజరూపచండాలుఁడా! నీవింక నిచ్చటనేయున్నావటరా! పాపాత్ముఁడా! పిల్లలంగన్నవాఁడవుగావటరా క్రూరా! మన్మథాకారుఁడయిన నాకుమారుఁడు నీకేమిహాని గావించినాఁడురా తులువా. నీసాహసంపువేటకు నాపుత్రుఁడే కాని వలనుగాదయ్యెగా! పసిబాలునిపై బాణప్రయోగముం జేయ నీకెట్లుమనసయ్యెనురా పాపీ! బ్రాహ్మణులంజంపు నీకింకను రాజనామమా! నీకింకను వైభవమా హా! దశరథచండాలా నాకుమారునిపాలిఁటి మారివై దాపురించితివి

గదరా హా! హా! గర్భశోకము దుర్భరము దుర్భరము హాకుమారా! ఎందుఁబోయితివితండ్రీ! ఓరిరాజా దశరథా! నిరపరాధులమగు మమ్ము లను పుత్రశోకంబునంజంపిన నీవును పుత్రశోకంబువలననే మరణింతు వుగాక! హాపుత్రకా! హా పుత్రకా! సతీమణి! నీవెచ్చటనున్నావు? నా కన్నులు తిరుగుచున్నవి, శిరస్సేమో భారమైనది. నాప్రాణములు నిలు వవు. పుత్రకా పుత్రకా హా పరమేశ్వరా! ప్రాణేశ్వరీ! రమ్ము రమ్ము. మనపుత్రుఁడు మనలంబిలుచుచున్నాఁడు. నారాయణ నారాయణ,

(ప్రాణములు విడుచుచున్నాఁడు)

ఋషి పత్ని—నాథా! నాథా! మీరునునన్ను విడిచిపోయితిరా? పుత్రకా! నాథా హా! హా! నారాయణా నారాయణా.

(ప్రాణములు విడుచుచున్నది.)

(వెనుక తెరపడును.)

దశ—హా! పరమేశ్వరా! (మూర్ఛిల్లును)

(కొంతసేపటికిమూర్ఛదేరి)

సీ. నాదనామక్రియా నతసద్గుణవిహీను
నను సంహరింపరే నగములార!
సుకుమారినై భూమిసురహంతనైనన్ను
సమయింపరే సూర్యచంద్రులార!
సింహేంద్రమధ్యంబు జేరితిపాపాత్ము
మ్రింగరే నను వనమృగములార!
నన్ను నినాయక శాపతప్తుఁడనన్నుఁ
బరిమార్పరే చరాచరములార!

గీ. భైరవీలోక భయదరూపంబుతోడ
రయమునను దుంపుమా నన్ను ప్రకృతికాంత

సూర్యభూపాల నీవంశ శోభకొఱకు
కాల్పు మా నన్ను నీచండకరదవాగ్ని.

ఆహా! ఇది కలయో నిజమో తెలియరాదు లోకరక్షాదక్షంబగు వాశరంబు నిరత రాధుల మువ్వుర నముయించి నిర్మలంబయిన సూర్యవంశంబున కీట్టికళంకము పాదించునని నేను కలనైన దలంచి యుంటినగనే! ఆముని దంపతుల మనఃక్షోభంబు నావంశాంతంబునకుం జాలునుగదా! దారుణంబై క్షత్రియకులారణ్యంబులం గాల్పందగిన యీ బ్రహ్మహత్యామహాపాతకంబును నే నెన్ని జన్మము లెత్తి తీర్చుకొనగలుగుదును! పుత్రశోకంబుచే మరణింతువుగాకయని యీ మునీంద్రుండు నను బెట్టిదంబుగా శపియించి మరణించెనే? ఇందుల కేమి చేయుదును? మునీంద్రులు నిరత కరుణాలురనివిందునుగదా! నాదుష్కృతి కలిమినే యాతనికి శాపబుద్ధి గలిగెంగా! ఓ మునీంద్రా! నీశాంతమంతయు నేమయ్యెనయ్యా! చంపుదలంచినప్పుడే నీశాపాగ్ని కింధనముం గాంచి చంపంజాలక పోయితివా! పుత్రశోకంబుచే చావ శపియించితివా! హా మునీంద్రా! నాకెట్టి దుర్గతిం గల్పించితివి! ఆహా శోకావేశంబున మతిచెడి నేనీ మునిశ్రేష్ఠుని దూషించుచున్నా నేమి? ఏకకుమారుండై తమ కేడుగడయని నమ్మియున్న సుపుత్రుని జలసేకరమునకై వచ్చిన నిర్దోషిని మృగయావ్యసనచేతస్కుండనై కన్నులుగానక సంహరించిన నాకిట్టి పాటుగాక సద్గతులుగలుగునే? ప్రాణములన్నియు దనపైనిడుకొనిన సుకుమారునొక్కనిసంహరించి యారసి పుత్రశోకంబుగల్పించి యీ మునిసింహుని తెగనిక త్తిని సంహరించిన నేను దోషినగుదునుగాక! కొడుకు చచ్చి కడుపు సలసల కాగి పుత్రశోకంబువలన నే ప్రాణములం బాయుచు నాకు నయితమా ప్రాప్తిగలుగం దిట్టిన మునిసింగ్రుం డెవ్వండయిన నింద్యుండగునా? ఆహా! నిర్భరము బ్రహ్మహంతనయిన నాకీశాపము వశ్యము తగులందగిన దేకదా,

ఓసూర్యభగవానుఁడా నేటికి నీవంశముక్క నీచాధమునిచే గళంకభూతమయినది. ఓపితృదేవతలారా పవిత్రమైనమీకులము బ్రహ్మహత్యామహాపాతకమున మలినమయినది. ఓసాకేతమా నేటికి నిన్ను బాలించువాఁడొక రాజాధముండను దుష్కీర్తి నందితివిగదా! ఓదశరథా నీపాపమేరీతి వాయు? నిర్దోషులై నీకారణంబున మారణంబునందిన విప్రులు మువ్వురును ఘోరగ్రహంబులై నీవెనువెంటం దవిలి సమయింపవే దుర్భరంబగు నీపాపమే నాకొక వెనుభూతముగాదె?

సీ. దుష్కీర్తియుఁ భూరిదుర్వారమై నా కు
లంబునెల్లను నాకులంబొనర్చె
బ్రహ్మహత్యామహాపాతకంబా నన్ను
విడువక నావెనువెంట దవిలె
ప్రాణముల్ బ్రాహ్మణశాపాదిక భ్రాంతి
వదలక తల్లడపాటుఁ గాంచె
శాపమా భరియింపఁజాలని పుత్రశో
కంబుతోడనె చావుగలుఁగ వ్రాసె
సూర్యవంశగౌరవము! భూసురుసికతన
ప్రథితరాడ్వంశములఁ దలవంపుఁ దెచ్చె
దుఃఖమున నెప్పుడో ప్రాణి దొరగనేల
నిపుడె సంతోషమున ప్రాణమీఁగునాఁడ.

(పొడుచుకొనఁబోయి మూర్ఛిల్లును,)

(నారదుఁడు ప్రవేశించును)

(అనుబంధము 10)

నారదు——(ఆలకించి) ఎక్కడిదీయార్తనాదము? ఆఁ! తెలసె! తెలసె! మునిశాపతప్తుఁడయినదశరథభూపాలుఁ డాత్మహత్యా ప్రయత్నంబున శోకించుచున్నాఁడు. ఆహా! ప్రమాదము తటస్థించెనుగదా!

సీ. దశరథుండాత్మహత్యాప్రాప్తిఁ జెందిన
సలరవివంశంబు నిలచు టెట్లు?
తరణికులంబు విధ్వస్తంబు జెంద శ్రీ
హరిరామమూర్తిఁ బొడమ టెట్లు?
హరి రామమూర్తియై యవతరింపకయున్న
నసురులు నిర్మూల మగుట యెట్లు?
మొదలంట దనుజనిర్మూలంబు గాకున్న
నఖిల భువనబాధలణగు టెట్లు?
గీ. కాన సురమునిలోక సౌఖ్యంబుకొఱకు
తీపిమాటలనాత్మసంతృప్తి జేసి
పంక్తిరథుఁడాత్మవధమును బడయకుండఁ
జేసి యీతరుణమున రక్షించువాఁడ.

దశరథా! లెమ్ము! నీకు శుభంబగును లెమ్ము!

దశ—(లేచి) ఏమిది నాభాగ్యము! సురమునీంద్రుఁడే దర్శన మిచ్చెను! (ప్రణా) నారదమునీంద్రా! నమస్కారము.

నారదు—చిరాయుష్మాన్ భవ!

దశ—దేవా! ఆత్మహత్యాప్రయత్నమున నున్న నన్ను మీ రిట్లు దీవింపనేటికి?

నారదు—ఏమిది! ఆత్మహత్యయా! రాజా! ఈదుర్వారప్రయత్న మేటికి?

దశ—మునీంద్రా! భూతవర్తమానకోవిదుండవగు నీ వెఱుంగనిది గలదే? అయినను తెలియనిచందంబున నడిగితివిగావున దాకర్ణింపుము.

గీ. సారనిర్దోషవిప్రసంసార మొక్క
యలుగుచే నావలన హతమయ్యె నయ్యొ

పుత్రశోకంబునను మృతిబొందుమనుచు
పటుతరంబుగశపించుచుఁబడితినయ్య.

నారదు—దశరథా! దివ్యదృష్టిచే నీవృత్తాంతమంతయుం దెలిసికొంటిని. కాని, నీ కీస్వల్పకారణ మాత్మహత్యాప్రయత్నముసకుం దగినదికాదు.

దశరథు—మహాత్మా! ఇట్టిదారుణశాపము నందియున్ననన్ను జీవింపుమని యాదేశించుచున్నారా?

నార—వెఱ్ఱివాఁడా! "శరీరమాద్యంఖలుధర్మసాధన" మ్మను పెద్దలపలుకులు వినవో? చచ్చి యెవ్వరినిసాధించెదవు? శరీరధారివై యున్నప్పుడే మానవుఁడు ధర్మమాచరింపవలయు.

దశ—అయ్యా! పుత్రశోకంబున నెప్పుడో చచ్చుటకన్న నిప్పుడే చింతారహితుండనై మరణించుట శ్రేయముగాదా?

(అనుబంధము 11)

నారదు—వెఱ్ఱివాఁడా! మరణించిన నదితప్పునని తలంచితివా!

క. మనుజుఁ డొనర్చుకర్మల
కనుగుణమగుఫలముదప్ప దసువులువిడినన్
ఘనతరముగ ననుభవమం
దిన వెనుకనె కలుషమెల్లఁ దీరును భూపా!

ఎప్పటికయినను దప్పసిశిక్షకొఱ కాత్మహత్యామహాపాతకము నయితము నెత్తినిం గట్టుకొందువే?

ఆ. వె. కర్మభూమియైన ఘనభూమితలమందె
సుఖము దుఃఖమందుఁ జూడవలయు;
పాపమాచరించి పరలోకగతుఁడైన
యెడల వానియిడుమ లనుమడించు.

కావున నాహితముం బాటించి గృహంబున కరిగి సుఖింపుము. మరియు నపుత్రకుండవైన నీకు పుత్రశోకశాపం బాకువి యిడుట తప్పక నీకు పుత్రులు గల్గుదురుగాకయని దీవించుటే యగును. నీ కిది యవశ్యము సంతోషదినము గాని సంతాపదినముగాదు.

దశ — మహాత్మా! యుక్తివాదనమున నన్నుఁ గట్టివైచినారు. నా కీబ్రహ్మహత్యాపాతకదుఃఖ మణఁగుట కేది తెరవు?

నారదు — వెఱ్ఱివాఁడా! ఇది బ్రహ్మహత్యయని తలంచితివా? బ్రహ్మహత్యగావింప నీ వెవ్వండవు? సకలము పరమేశ్వరసంకల్పము నం గాదె ప్రవర్తిల్లు? మఱియును నీకొక్క దేవరహస్యము నెఱిఁగించెద వినుము.

సీ. అఖిలదేవబ్రహ్మ ణాంతకులైన రా
    త్రించరుల్ కడలాక్రమించిరయ్య
  దనుజులకతమున ధర్మంబు నశియించి
    పాపంబుసర్వత్ర ప్రబలెనయ్య
  జగతి రావణదైత్య సంహారమునకయి
    విష్ణుండు మనుజుఁడై వెలయునయ్య
  అతనికి భూలోకమం దన్నివిధముల
    జేజేలు సాయంబు జేతురయ్య
  దాపఁగా నేటి శాచక్రధరుఁడె నీదు
  గర్భమున నుద్భవంబును గాంచునయ్య
  ఆహరికిఁ బ్రియజనకుఁడవై చెలంగు
  విమలశుభకాలమింక ప్రాప్తించునయ్య.

ఈమునిదంపతులును మునిబాలుండును మానవులుగారు. దేవహితము నుగావింపవచ్చి నీకు శాపకారణంబును గలిగించిన పార్వతీపరమేశ్వరు

లును, కుమారస్వామియు నని యెఱుంగుము. రజితాచలంబున ప్రమథగణ పరిసేవ్యమానుండై యున్నయాశంకరమూర్తిం గాంచుము, నీ సంశయములన్నియుం దొలంగఁగలవు. (కన్నులు తుడుచును.)

(కైలాసము కనఁబడుచున్నది.)

(అనుబంధము 12)

దశ—(చేతులు జోడించి) హే త్రిపురాసురదుర్మదాంధకార మార్తాండరూపాయ సహస్రకోటిదరసర్వాంగవిభూషితాయ నిరంతరప్రేతకాంతారప్రచారపరాయణాయ నిర్మలనీలాంబరభాగీరథీశశాంకజటాంకాయ గజాసురచర్మాంగవిభూషిత సర్వాంగకాయ హే! శూలపాణీ! పార్వతీప్రాణనాథాయ నమస్తే నమస్తే.

(ధ్యానించుచున్నాఁడు)

(కైలాసము అంతర్ధాన మగుచున్నది.)

దశ—ధన్యోస్మి! ధన్యోస్మి! నారదమునీంద్రా! లయకారణుండైన సదాశివబ్రహ్మంబును గాంచి నాజన్మంబు తరించె.

మ. అపచారంబులు నాసెనన్నియును బ్రహ్మానందమయ్యెన్; భవత్కృపచే శంకరదివ్యమంగళ మహాధీరాత్మఁ గన్గొంటి; ధాత్రిపలోకంబున ధన్యమూర్తినయితిన్ శ్రీవిష్ణువే దేవతాధిపుఁడే పుత్త్రుఁడుగా జనించుటను ధాత్రిన్ నాశుభం బల్పమే.

నార—దశరథా! నాకు కాలాతీతంబయ్యె. ఈమునిదంపతులకును బాలునకును సంస్కారంబు గావించి పురంబునకేఁగి సుఖప్రాప్తికై పుత్రకామేష్టి యను యజ్ఞం బాచరింపుము. నేను పోయివచ్చెదను.

దశ—మహాప్రసాదము.

నారదు—(నిష్క్రమించును.)

దశరథు—(అనుబంధము 13) (నిష్క్రమించును.)

ప్రథమాంకము సంపూర్ణము.





# శ్రీ రామ జననము.

## ద్వితీయాంకము.

ప్రథమరంగము.

దశరథునిసభాభవనము.

(సుమంతుఁడు, వసిష్ఠుఁడు, దశరథుఁడు ప్రవేశింతురు.)

దశ—గురువర్యా!

సీ. కావించితిని విప్రదేవహితార్థమై
సుఖవిశిష్టంబైన మఖచయంబు
తనియఁజేసితిని సంతర్పణాదికముల
జన్నిగట్టులను మృష్టాన్నములను
వారించితిని నిజవాహినిచే దిశ
లందున మద్విజయాంకురములు
వహియించితిని భూమిభారంబుభుజముల
నరువది వేలవర్షాంతరములు
సాంద్రపరచితినిజయశశ్చంద్రికలను
గువలయాంతస్థదిక్కుంభికుంభములను

కాని నామదిలో పూర్ణమైనసంత
సంబు లేదనపత్యదోషంబుకతన.

ఇందుల కేదిమార్గము?

వశి___దశరథరాజేంద్రా! విచారింపకుము. గ్రహబలముంబట్టి చూడ నీకిప్పుడు సుపుత్రోదయ మగుశుభ కాలము సమీపించుసూచనలు గాన్పించుచున్నవి. అదిగాక,

ఆ. కదళులెల్లతూర్పుగాగెలల్వేసెను
వందలాదియాలమందలీన
పురజనంబులకు సుపుత్రోదయంబులు
వచ్చుతోరణములు వ్రేలెనయ్య.

దశ___గురువర్యా. స్వప్నవార్తలవలె మీపలుకులు నాకానందముం గలిగించుచున్న వేకాని నాకంతటిభాగ్య మీజన్మమధ్యమునం గలుగుట లేదుగదా?

వశి___లేకేమి? నీకుజ్ఞప్తికివచ్చుటలేదు. కాని వెనుకనొకమాఱు నీకుసుతప్రాప్తి గలుగునని నారదుండాదేశించినట్లు వచించియుంటినే?

దశ___(అస్మృతినభినయించి)అవునుసుడీ; మహాత్మా? ఇది చిర కాలమునాటి మాటగదా? నాకిది మఱపునకువచ్చెనేమి సుమంతా? నీకదిజ్ఞప్తియున్నదా?

సుమం___లేకేమి. మహారాజా! అట్టిశుభకాల మెప్పుడాసన్న మగునాయని కాచుకొనియున్నారముగదా! తత్సుతప్రాప్తికై పుత్రకామేష్టియనుయజ్ఞంబొనర్పుమనియు నారదుండుపదేశించినట్లు తమరు చెప్పితిరనిజ్ఞాపకము. నాడుమనకు నేపాళరాజగు వక్రపాణిపైదండెత్తఁబోవుఘనకార్యము కలిగియుంట నప్పటికాప్రయత్నము మానితిమి.

వశి — అవును. ఎప్పటి కేకార్యము జరుగుటయు మనుష్య ప్రయత్నముః లేదుగదా

ఆ. వనము లెండిపోవునని ధూమమూదిన
నదిన కాలజలదమగుటయట్లు
ప్రకృతికదనుగల్గి ప్రావృడ్ఘనాఘన
కోటివిడచు గాక కుంభవృష్టి.

దశ — మహాత్మా అట్లయిన సిప్పుడేదికర్తవ్యము.

వశి — మన సుమంత్రుఁడు వచించినట్లు పుత్రకామేష్టియవశ్య కర్తవ్యము. కాని యందులకొక గొప్పనిరోధముగలదు.

దశ — గురువర్యా? అది యేమి.

వశి —

సీ. లోకమాయాజాలలోలతారహితుండు
నిరతసచ్చింతనాపరవశుండు
మాధవనామసంస్మరణానురక్తుండు
నరివర్గ దూరీకృతాంచితుఁడు
సంతతనీరంధ్ర కాంతారవాసుండు
నతిలోకనిష్కల్మషాశయుండు
లోలవిలోచనాలోకనాజ్ఞాతుండు
ప్రేమాంతరంగదయామయుండు
పరమపూజ్యుండస్ఖలితుఁడౌ బ్రహ్మచారి
పూజితుండుసన్ముని కులభూషితుండు
నైనభగవత్సమానుఁడౌ ననఘు వలనఁ
బుత్రకామేష్టియొనరింపఁ బోలునయ్య.

సుమం—అట్టిమహాత్ముఁడు మర్త్యలోకమునందుండుటరుదుగదా ?

దశ—(విచారముతో) మహాత్మా! ఈయందని మ్రానిపండ్లకై నా కాశలుగొలుపుటేల!

గీ. పరిహాసింపనారదుఁ డట్లు పలికెఁగాక
నాకు సంతానలాభ మేమాడ్కి గల్గు
ప్రాయము ననేకవేలవర్షములుఁ గడచె
నిఁకనిరాశకన్నను మార్గ మేదిగలదు.

వశి—(చిఱునవ్వుతో) రాజేంద్రా! అట్లధైర్యపడెద వేమి నేను వచించునదంతయు సాంతముగా నాలకింపుము. ఇందాశాభంగకారణ మేమియును లేదు.

దశ—అట్లయిన నవహితుఁడనై యున్నాను.

వశి—

మ. యజనంబుం బొనరింప నర్హుఁడలఋష్యశృంగనాముండు స
ర్వజనామోదకరప్రవర్తకుఁడు భాస్వత్పుణ్యుఁ డవ్వాని చే
నజరుద్రాదిసురేంద్రసమ్మతమహాయజ్ఞంబుగావించి ది
గ్విజయంబుం బొనరించు పుత్త్రకుల నుర్విం గాంచుమా భూధవా.

సుమం—బాగు. బాగు. ఈయుపదేశము సర్వవిధముల శ్లాఘాపాత్రముగానున్నది.

దశ—వశిష్ఠమునీంద్రా! ఋష్యశృంగుఁడు బహుళతపోమానితుఁడనియు లోకానుభవదూరుఁడనియు నన్యచింతారహితుఁడనియు వింటిని. మనప్రార్థనములం బాటించి యాతండు మనల ననుగ్రహించునే ?

సుమం—అందులకు నయితి మొకమార్గమును మనకు వశిష్ఠభగవానుఁడే యుపదేశింపక పోఁడు.

వశి—రాజేంద్రా! నీయభిప్రాయమే నిక్కువము. మనప్రార్థనములకులోఁబడి యాతండు వచ్చువాఁడు కాఁడు. మనపురమునందలి

కొందఱు వారాంగనలంబంపి ప్రపంచజ్ఞానరహితుం డగువాతని మాయోపాయంబున రప్పింపవలయును.

(తెరలో వైతాళికులు)

మ. నతసరయూతరంగములలో నాడఁగఁజొచ్చె మరాళసంతతుల్
క్షితిరుహసాంద్రశాఖలను జేరె ద్విజావళు లెండవేఁడిమిన్
హతముగనుష్ణతీవ్రవిలసానిల మెల్లడవీచె దండిగా
నతులితతీక్ష్ణచండకరుఁ డంబరమధ్యము నప్పొలింగెనున్.

సుమం—మహారాజా! వైతాళికులు మధ్యాహ్నముఁ దెలుపుచున్నారు

వశి—భవిష్యత్కార్య విధానమును సావకాశముగా నెఱింగించెదను రమ్ము.

దశ—చిత్తము. (తెరపడును)

(—ఋష్యశృంగాశ్రమము—)

(నీలవేణి, కనకాంగి, లలిత ప్రవేశము.)

(అను. 14)

నీల—కనకాంగీ! ఋష్యశృంగ మహాముని ప్రపంచజ్ఞానమే లేనివాఁడట. ఇంతకాలమునుండియు నెందరు సరసులను మెప్పించినారముగాని యిట్టియవస్థను మనమెన్నఁడును చూడలేదు.

కన—ఓసి నీలవేణీ? అవస్థయందు వేమి? ఇట్టి మహాత్ముల పరిచర్య యెంతటివారికి లభించును. మన మేజన్మమునన్నో చేసిన పుణ్యవిశేషమున నీకోసలరాజ్యమునం దనేకులు వారాంగనలుండగాఁ దశరథ భూపాలుండు మనలనే పంపినాడు.

నీల—నీకు సన్యాసులపొత్తు గూడు టలవాటు గనుక నీవిట్లనుచున్నావు. నీగుణము నేనెఱుఁగనా? ఇందీవరికయింట నీడ్చివేసినయిం

దుశర్మను మఱిగి నీకుఁ గలసొమ్ముకూడ త్రాగుడుక్రింద దోఁచిపెట్టిన తెలివిమాలినదానవు గావా నీవు? ఆసమయమున మీయమ్మయే లేకుండెనా?

కన—అవును. నీబ్రతుకునకు నీవును నన్నువలసినదే—బోసినోరు-బట్టతల—పట్టెనామములు-పొడుముకంపు—శుద్ధఛాందసవేషమునుంగల కేశవాచార్యులకన్నను యిందుశర్మ తీసిపోలేదు లే—కేశవాచార్యుల పరమాసహ్యవిగ్రహమును—పీనుగులు మోసినడబ్బున కాశించి పూజించిన మహానుభావురాలవు గావా నీవు?

నీల—కేశవాచార్యులకేమి? పరమపూజ్యుఁడైన బ్రాహ్మణుఁడు. కులభ్రష్టుఁడైన యిందుశర్మగాఁడు లే.

కన—ఆ! కేశవాచార్యుని పరమపూజ్యత నీయెంగిలితినినప్పుడే తెలిసినది లే! దానికేమి; మనయిండ్లకు వచ్చువారిలో నెవ్వరికి కులమున్నది.

(అనుబంధము. 15)

లలి—కనకాంగీ! నీలవేణి ! మీకిదేమి కుతర్కవాదము? చాలుచాలు! వేళ యతిక్రమించుటయున నెఱుంగరో, మీరు జగమెఱిగిన జగజంతలే యగుదురు గాక ! మీమీ మహిమంబు లెవ్వ రెఱుంగరు. ఋష్యశృంగుని విటునిఁ జేయనెంచి చనుచుంటిరిగదా ! అల్లదే, ఆశ్రమము సమీపించినది. మీకలహంబులాతఁడాలకించిన కార్యభంగమగుట తప్పదు; వేగముగఁ బోవుదము రండు.

(అనుబంధము 16)



తృ తీ య రం గ ము.

(అనుబంధము 17)

(గుఁడు ప్రవేశించును.)

ఋష్య—(తనలో) ఆహా! ప్రకృతి యెంతటి విలాసమయమైనది.

చ. జలముల మత్స్యసంతతికి సాంద్రవనంబులలో మృగాళికిన్
చలదవనీరుహంబుల ద్విజంబులకుం గ్రిమికీటకాళికిన్
ఇలపయిఁ బ్రాకుచీమలకు నే యెడలందు మనుష్యకోటికిన్
వలసిన భుక్తి నిచ్చు భగవంతుఁ డదెంతటిశక్తివంతుఁడో!

మరియును,

సీ. చలియు వేడిమియు వంతులువైచుకొని కాయు
సుందరులగు సోమసూర్యులొకట
ఉదయంబు వికసించి యొనర సంధ్యల జీవి
తమును జాలించెడు సుమములొకట
కడు ననంతంబు నగాధంబులై శోచు
నుదధి యాకాశంబు లొక్కచోట
తొలుత భీమాకృతితో వచ్చి చల్లగా
వర్షించు జలధరపంక్తు లొకట
ధరకు ఫలభారమున వంగు తరువు లొకట
సుందరచరాచరము లెల్లచోటులందు
ప్రకృతికర్త మహత్త్వంబుఁ బల్కుచుండ
నాతఁ డెంత సమర్థుఁడో యరయవశమె!

ఆహాహా! ఈప్రపంచమునందలి చిత్రముం జూడఁజూడ మహా
దానందంబు గలుగుచున్నది గదా! చరాచరములను నిర్మించి—

వాని యం దన్యోన్యానురాగమును గల్పించి పెంచి వానిం దిలకించి తా నానందించు నాచిదానందవిగ్రహముం దిలకించినవా రెంతటి ధన్యులో కదా!

సీ. అల్లిబిల్లిగ వల్లు లల్లు కౌఁగిళులందు
పరవశత్వమునందు తరువులందు
ఒనర నవ్వుచు ద్రుళ్లుచొండొంటిపైఁ బడి
ప్రేమ ముద్దిడు జలోర్మికలయందు
ఎటనుండియో వచ్చి యలవాలి కమలాళి
చుంబించు భానుకరంబులందు
బిగియారు కౌగిళ్లఁ బెనవేసి వాయుడో
లికఁదేలు జలధర ప్రకరమందు
చిగురువిందులఁ గొసి కథ జెప్పికొనుచు
జొంపములను జేరిన ద్విజదంపతులను
పుట్టివిడువఁ బ్రేమామృత ముట్టిపడెడు
ప్రకృతి యంతయు నిశ్చలప్రణయమయము.

ఇట్టి మహాప్రకృతి నిర్మాత భజనమేకదా మానవునకు సదా తారకము! కావున నాపరమేశ్వరుని ధ్యానించి యానందింతును. ఓ సర్వభూతాంతర్యామీ! జగన్నాటకసూత్రధారీ! ప్రణతోస్మి!

ఉ. నీవె జనింప జేయునెడ నీరజగర్భుఁడవోము వేళలన్
నీవె యధోక్షజుండ వయి నిల్తువు నాశనకాలమందునన్
నీవె కదా లయాకృతిని నిల్తువు భీకరరుద్రమూర్తివై
దేవ మహానుభావ భవదీయవిలాసమె సృష్టియంతయు

(ధ్యానించుచున్నాఁడు)

(తరువాత — వేశ్యలు ప్రవేశించుచున్నారు.)

కన — నీలవేణీ ! అల్లదే, ఋష్యశృంగ మహాముని తపోనిష్ఠయం దున్నాఁడు ! మనమాతని హృదయమున కనుగుణమయిన భగవత్కీర్తనముం గావింతము.

(అందఱు భగవత్కీర్తనము చేయుచున్నారు)

(పంచచామరము.)

చరాచరప్రకల్పనాని సర్గశక్తిసంయుతా
హరామరేశసారసోద్భవాది దేవవందితా
జరామయాద్యపాయదుఃఖ సర్వభీతిదూరితా
పరాత్పరా నిరామయా విపన్నలోకరక్షణా.

ఋష్య — (కన్నులు విప్పి) ఆ ! ఏమిది ! భగవన్నామసంస్మరణము వినంబడుచున్నది. ధన్యాత్ముఁడ నయితిని. (పరికించి)

(అనుబంధము 19)

ఓహో ! ఏమిది! నేనీశ్వర ధ్యానమునందుండ నాకన్నులకు మిరుమిట్లు గొలుపు నీదివ్యమూర్తులు సాక్షాత్కరించినవి.

సీ. అరవిందములఁ గేరు సురుచిరవదనముల్
తమతపోగురు మహత్త్వంబుఁ దెలుప
సతతధగద్ధగాయిత భూషణంబులు
భక్తసంజనితసచ్ఛక్తిఁ దెలుప
వరకాంతియుతములౌ వల్కలాజినములు
తమ యోగశ్రీమంపుటందంబు దెలుప
రాలైన కఱఁగింపఁ జాలు సంగీత మీ
శ్వరవశీకరణభావంబు దెలుప

దేవతామూర్తులోయన దేజరిల్లు
యాచవారహితముగఁ బ్రత్యక్షమైన
వీరలెవ్వరో నాభాగ్యవిభవముగను
నను గృతార్థుని గావించినారు నిజము.

వీరికి స్వాగత మిచ్చెదగాక— (సమీపించి) మహాత్ములారా! అయాచితకరుణావిశేషమున నాకు దర్శనమిచ్చిన మీకు నమస్కారణ పూర్వక స్వాగతము.

నీల—(అప) కనకాంగీ! ఈతండు స్త్రీపురుషవివేచనజ్ఞానము లేని మునిరాజు. పాపమీతఁడు మనలను సయితము పురుషులనుగా భావించుచున్నాఁడు. ఇప్పుడు మనము నటులే నటింపవలయును.

కన—(అప) అటులే నటింతము.

లలి—(అప) ఈతని యమాయికత్వమువలన సులభముగా వశమగునని ధైర్యము కల్గుచున్నది.

నీల—మహాత్మా! నమస్కారము.

కన—మునీంద్రా! అభివాదనము.

లలి—సంయమీంద్రా! ప్రణామము.

ఋష్య—అయ్యా! నన్ముని చంద్రులారా.

ఆ. కడుజుగుప్స దోచు గడ్డముల్ మీసలు
గానరావు మీకు భానసముల
తనువు బ్రహ్మకాంతి తరళితమై యొప్పె
నట్టి మహిమచేత నెనయువారో?

అదిగాక, నాఫాలతలంబున నొకశృంగంబుగల్గుటచే నన్ను నాటిఋషిసత్తము లందఱును ఋష్యశృంగుఁడని పిలతురు. మీకు రెండేసి శృంగంబులు గల్గుట నాకపరిమితాశ్చర్యముగానున్నది.

కన—(లజ్జతో అభివారించి) నీలవేణీ! ఈతడు మన స్తనభాగ
ములను శృంగములనుగా వర్ణించుచున్నాఁడు.

నీల—ఆహా! ఈతఁడెంతలోక మెఱుంగనివాఁడు!

ఋష్య—ఓమునివరులారా!

సీ. విరుసుగా లేక మీ వేణీభరంబు లీ
గతి కాంతియుతములౌ కతమ దేమి
నీల—మా యాశ్రమములందు మాన్యులౌ మానులీ
విధ తైలములను గల్పింతురయ్య
ఋష్య—మా వారచీరలమాడ్కిఁ గాన్పింపవు
మీ చీరలెందు నిర్మించిరయ్య
కన—యీవిధంబగు నారలీను వృక్షంబు లే
వేళ మా వనములఁ బెరుగునయ్య
ఋష్య—ధగధగలాడు రుద్రాక్షలెందునుగాన
నిచట వీనిని గణియించిరయ్య
లలి—వెరుగ నేమిటికి మా వృక్షంబులందెల్ల
నీరీతి రుద్రాక్షలే మునింద్ర
ఋష్య—సామగానము మీరు సంగీతములు మీకు
నెటులలవడియె మహీసురేంద్ర
నీల—ఎల్లవేళల నీశ్వరేష్టానుమతగాన
విద్యయే మా విద్య విమలచరిత

ఋష్య—ఎచటఁగలదు మీయాశ్రమ మచలులార!

కన—కోసలంబునఁ గలదు విలాసయుతము

ఋష్య—నాకు జొరశక్యమగునె పుణ్యాత్ములార!

లలి—ఇంతకన్న భాగ్యంబు మా కేది గలదు.

ఋష్య—అయిన నీశుభముహూర్తమునందే నన్ను గొని పోయి కృతార్థుని జేయుఁడు.

నీల—మహాభాగ్యము.

ఋష్య—ధన్యాత్ముఁడనైతిని. కాని మహాత్ములారా! మధుర రసపూరితమయిన మీసంగీతమును మరలమరల వినవలతును. భగవ ధ్యానము గావించుచుఁ బోవుదము

నీల—తమ చిత్తము.

వేశ్య—(పాడుచున్నారు. పరవశుండై ఋష్యశృంగుడు వారి ని వెంబడించి చనుచున్నాడు.)



3 వ రంగము—అయోధ్యలోనియజ్ఞమంటపము

(ప్రవేశము దశరథుఁడు, వశిష్ఠుఁడు, ఋష్యశృంగమునీం ద్రుఁడు, సుమంతుఁడు, ఋషులు మొదలగువారు)

వశి—పుణ్యస్వరూపుఁడవగు నో ఋష్యశృంగమునీంద్రా!

గీ. అమరహితమైన సత్కార్యమాచరింప
నినుబిలువనంపినాము మునీంద్రవంద్య!
మహితకరుణారసంబున మమునను గ్ర
హించి పుత్రకామేష్టిఁగావింపుమయ్య.

ఋష్య—అమరసమ్మతమైన యీకార్యము నావలనఁ గావిం పఁబడుమహాభాగ్యము గల్గుట నాకెంతయు నానందజనకమైయున్నది కావున, నీకార్యమును నేను సంతోషముతో గావింపఁబూనుకొను చున్నాను.

వశి—దశరథా! యజ్ఞారంభముఁ గావింపఁదగిన గురునమ స్కారము నాచరింపుము.

దశ — మహాప్రసాదము. (ప్రదక్షిణనమస్కారములం జేయుచున్నాఁడు.)

ఋష్య } సుపుత్రప్రాప్తిరస్తు. (దీవించుచున్నారు)
వశి }

బ్రహ్మ — (మంత్రములు చదువుచుండగా)

ఋష్య —

గీ. విజయి! స్వాహాసతీమిత్ర! వీతిహోత్ర!
స్వస్తి సకలజనామోద! జాతవేద!
సుతులఁబొడఁగాంచి మమ్మునను గ్రహించి
దశరథునిఁ బుత్రసంప్రాప్తిఁ దనుపుమయ్య

(హోమము చేయుచున్నాఁడు.)

(అగ్ని నుండి యజ్ఞపురుషుఁడుద్భవించి)

యజ్ఞ — దశరథా! నీభక్తికి మెచ్చితిని. ఇది పాయసనసంకీర్ణమగు సువర్ణపాత్రము. ఈపాయసము నీసతులు భక్షించిరేని సుతసంప్రాప్తి గలుగును. నీకు శుభమగుగాక. (అతర్ధానమగును)

దశ — ఆహాహా! నేఁటికిగదా ధన్యుఁడనైతిని.

వశి — ఋష్యశృంగమునీంద్రుని కరుణారసంబున పుత్రవంతుండవయితివి. ఆమహాత్ము నెంత గొనియాడినం దీరదుగదా!

దశ — మహాత్మా! ఋష్యశృంగమునీంద్రా! మీరొనరించిన మహోపకారంబున కొకనమస్కారమున కన్న నధిక మేమియుఁ గావింపలేను.

ఋష్య — దశరథా! నీకు శుభమగును. నావిధ్యుక్తకర్మమున కన్న నధిక మేమియుం జేయలేదు. ఇంక నీవు నీకార్యమునందుండుము

(అందఱు నిష్క్రమింతురు.)



# శ్రీ రామ జననము.

## తృతీయాంకము

### ప్రథమరంగము—అయోధ్యలోని వీధి.

(కైకదాసి మధుర ప్రవేశము.

మధు—(తనలో) దేవియగు కైకేయి వేవిళ్లు నన్న నేకసావిళ్లు త్రిప్పి తుదకు నాచాంపు దగ్గరకుఁ దెచ్చుచున్నది. చింతపండుకన్న పుల్లని వస్తువు నెక్కడ సంపాదించగలను. అదిగో! కౌసల్యాదాసియగు కావేరి యిట్లువచ్చుచున్నది. ఇది యేమియును సలహా చెప్పునేమో!

కావే—(ప్రవేశము) మధురా! వేగముగాఁ బోవుచుంటి వెక్కడికి?

మధు—ఎక్కడికి? నామగని నల్లమందుకొరకు, మాదేవి పుల్లమందుకొరకు.

కావే—నీమగని నల్లమందు సరేగాని మీదేవిగారి పుల్లమందేమిటి?

మధు—అదేమి పాపమో కాని, కావేరీ ఇట్టివిపరీతపు వేవిళ్లు నేనెన్నఁడుఁ జూడలేదుసుమా! అన్నము తిననే తినదు, తినెనా, వింట

నే వెళ్లఁగ్రుక్కుకొనును. నీళ్ళు త్రాగదుగదా! ఎంతతీయని నీళ్లయిన నుప్పగానున్నవని తగవులాడును. మెత్తగా పఱ్కవేసిన రాయి వలెనున్నదని విసువుకొనును. ఇప్పుడు చింతవుండు కంటె పుల్లనివస్తువు కావలెనని నన్నంపినది. అట్టివస్తువేమున్నది?

కావే—ఇష్టములేని మగని ప్రేమయున్నదిగదా!

మధు—సరే! అది నీస్వానుభవము.

కావే—నాస్వానుభవమే కాదు. మీయొకకేయిదేవికిఁగూడ స్వానుభవము కాఁగలదు.

మధు—అదేమి? మహారాజునకు మాదేవిపై నిష్టము లేదాయేమి?

కావే—ఆ! యిష్టము లేకేమి! ఆసౌందర్యవతిపై నెవ్వరికిష్టముండదు?

మధు—ఏమే నిపౌగరు! మాదేవికన్న ముసలికౌసల్య యందగత్తెయాయేమి?

కావే—పెద్దదయినంత నే ముసలిదని యాక్షేపించుచున్నావు. మాదేవి తనరసికతచే మహారాజును మెప్పించును. చురుకుపాలున్నంతమాత్రమున లోనిపస లేనిమీదేవి మాదేవికాలిగోరుకైనను సాటిరాదు. పోనిమ్ము! నీతో నాకెందులకు; నాకు పొద్దు పోయినది; నేనుపోవలయును (పోఁబోవును)

అనుబంధము 20

మధు—కావేరీ! కావేరీ! ఒక్కమాట! అట్లయిన మహారాజు మాదేవియింటికేల రాడిందువా?

కావే—అయ్యో! రాకేమి? మహారసికురాలు. మీయొకక ఆమె

యింటి కెట్లు రాకుండును? ఆమె దాసివి నీవే యాతని నాకర్షింపఁ గల రసికురాలవు. (నిష్క్రమించును)

అనుబంధము 21

మధు—(రోషముతో) అన్నన్నా! పాడుముండ కావేరి కెంతపొగరు, ఇది లోనివసల నెన్నఁగల సమర్థురాలయినదా! ఆ కపటియగు దశరథుఁడును దుర్మార్గురాలయిన కౌసల్యయుఁ దమ యంతఃపురమున నేమియు గుసగుస లాడి కైకను తిట్టకున్నచో నీముండ యిట్లు ప్రేలదు. ఆదశరథుఁడు రాత్రినుండియు మా దేవియింటికి రాలేదు నిజమే! ఇంక నాతండు కౌసల్యోపదేశమున వాదలంచుకొన లేదుగాఁ బోలును; సరే! చింతపండుకంటె పుల్లసివస్తువు మనసు లేని మగని ప్రేమయని చెప్పి మా దేవియగు కైకకు సర్వవిషయముల నెఱింగించెదను.

అనుబంధము 22



5 రంగము కౌసల్యాంతఃపురము

(ప్రవేశము ధశరథుఁడు, గర్భిణియగు కౌసల్య.)

దశ—ప్రియురాలా! కౌసల్యా!

సీ. లలితశరీరమెల్లను పాండురంబయ్యె
విమలకపోలంబు వెల్లఁబారె
ప్రసవోన్ముఖతనితంబము ఘనమయ్యెను
మహితప్రయాణంబు మందమయ్యె
పురూపరీతి నూరుపులు దీర్ఘములయ్యె
కాయమంతట వింతకాంతియలమె
వింతవస్తువులపై స్వాంతంబు చనసాగె
ప్రాతవస్తువులపై రోతవొడమె

నుల్లమున స్వార్థకారేచ్ఛ యుదయమందె
నుదరమున సంచలనవిధ ముద్భవించె
ప్రసవచిహ్నము లిపుడు చూపఁగఁదొడంగె
కలికి సత్పుత్రయోగంబు గల్గునీకు

కౌస — నాథా! నిరంతర మిట్టిపరిహాసముతోడనే ప్రొద్దుపుచ్చ దలంచితిరా? మీకేమియుందోపకున్న రాజకార్యములపైఁబొందు.

దశ — సాధ్వీ నాకిప్పు డింతకన్న రాచకార్యమేమియు లేదు. లేకలేక కలుగఁబోవు వరప్రసాదసంతానము. అందు నాకు సర్వవిధముల ననుకూలవతివగు నగ్రమహిషివి. నీయందనురక్తుఁడనై యీవలనుండి వెలువడలేకున్నాఁడనయిన నాశ్చర్యమేమున్నది? కోసలరాజపుత్రీ! నీవలనఁగదా నావంశము నిలువనున్నది.

కౌస — నాథా నన్నింతగా స్తుతించెద రేమి?

చ, ఇలను భవద్దయారససమృద్ధిని బట్టపుదేవియంచు నౌఁ
బిలతురుగాదె తావకవిసర్గలపుణ్యముచేత పుత్రకు
ల్గలుగఁగనున్నవారలు జగత్పరిపాలక దారనై నా
వలననుగల్గుకార్యము లవంబును నున్నదె సంస్తుతింపఁగౌఁ

దశ — యజ్ఞపాయసమువలన దైవాంశచేగర్భవతి వయిననిన్నుఁ గాంచినతోడనే భార్యవనుస్మృతిగతించి భక్తి గల్గుచున్నది. కోసలరాజపుత్రీ! దాపనేల? నీకు నమస్కరింప మనసగుచున్నది.

కౌస — (కన్నీరునించి) మహారాజా! దాసినగు నన్నిట్లు లాడవచ్చునా? ఇట్లాడుట నన్నవమానించుటే కాదే! మీకుపరిహాసమాడవలయౌనన నెన్నివిషయములు లేవు, మీకిదేవిషయమా.

దశ — (కన్నీరుతుడుచుచు) వెఱ్ఱిదానా! విలాసముగానన్నమాటకింత వగపేటికి. పోనిమ్ము! నీకీవిషయమింతకష్టముగానున్నచో, నే నెత్తను లెమ్ము.

అన్నట్లుగ మఱచితిని. నాఁటి పాయసమును మీరెట్లారగించి తిరి? నీవు నాఁడేదియో చెప్పితివి గాని యన్యాలోచనావశుండనయి విననయితి. తిరిగి యెన్నఁడైన, నడుగవలయునని తలంచితినిగాని సమయము మొదవదయ్యె.

కౌస — మీ రానతిచ్చినచందమున సగము నేను గైకొంటిని. మిగతసగంబున సగము సుమిత్రకొసంగితిని. ఆనాల్గవభాగంబును వెండియు రెండుగావించి యొకటి కైకకును రెండవది తిరిగి సుమిత్రకు నొసంగితిని. కాని, నాథా! సుమిత్రకు రెండుమారులిచ్చుటకును కైకకు స్వల్పముగానిచ్చుటకుం గారణమేమి?

దశ — దేవీ! ఇది మనుష్యసంకల్పముగాదు. అట్లు గావింపుడని గురుజనులయాజ్ఞ.

కౌస — ఇది దేవహితమేగాని కేకయరాజపుత్రికకు మాత్రము సంతాపహేతువేమోయని భీతిల్లుచున్నాను.

గీ. తొలుతనుండియు నేనన్నధూర్తయగును
గాఢమాత్సర్యపేటి కైకావధూటి
పాయసవిభాగమును నేనె సేయుకతన
చంచలాక్షి నాపైనఁ గోపించియుండు.

దశ — ప్రేయసీ! అన్నట్లు నీమాటవలన నాకొకటి జ్ఞప్తికివచ్చుచున్నది. నిన్నటిదినము కైకయింటికేఁగవలసిన వంతుదినమయినను నాకిచ్చుటనుండి కదలుటకు మనస్కరింపనికారణమున నేఁగనేలేదు. అందులకాబాల యెంత జాలింబడియెనోకదా?

కౌస — (కొంచెము కోపముతో) అవును ......... కాదామరి. క్షణమెడఁబాసి నిలువలేని దంపతులకీయెడఁబాటు మహాదుస్సహము గదా? పాపము. చెల్లెలు కైకను మహావిరహసముద్రమున ముంచి

మీరు విరహముపాలగుట యుక్తముగాదు; శీఘ్రముగా దాని యింటికిఁ బొందు "చెలీ! కావేరీ! ఈమహారాజునకు పావము, కైకాంతఃపురమునకు మార్గముంజూపవే.

దశ — ప్రియసీ! నామాటకింతిగా నలుగనేల. కైకయు నీవంటిదేగదా? దాని యెడమాత్రము సమానభావముం జూపవలదా?

కౌస — అయ్యో! ఎంతమాటాడితిరి? ఈపలుకులు మీప్రియురాలు కైక విన్న కోపించునుగదా? సర్వకార్యసమర్థయగు కైక నేమియుఁ జేతగాని నాతోఁ బోల్చి సమానమనుచున్నారేమి? నేనేమిరథమునడుపఁగలనా? రణమొనర్పఁగలనా? మీమెప్పువడయుటకు మీతో నందనోద్యానమున విహరించుటకు వలయునప్పుడు వరములంబడయుటకుఁ దగిన ధీరురాలిని నాతోఁ బోల్చియామె కీర్తికిఁ గళంకముఁ దెచ్చితిరిగదా నాథా?

దశ — ప్రాణేశ్వరీ! మరిన్ని సాహసకార్యము లొనరించినను కైక నీకు సాటియగునా?

శా. నీసౌందర్యము నీవిలాసమును నీనిర్వ్యాజవాత్సల్యమున్
నీసద్బుద్ధియు నీయొయారమును వాణీహృద్విలోలత్వమున్
నీసంభాషణచాతురీమహిమముఁ నీసారువేయేళు ల
భ్యాసంబుం బొనరించినం దెలియరా దాకైకకుం గోమలీ.

కౌస — ఈముఖస్తుతుల కేమిలెండి! దక్షిణనాయకులగు మీకీ పాటిస్తుతిపాఠములే రానిచో నిందరపత్నుల నేరీతిః సమర్థింపఁగలరు?

దశ — సఖీ! ఇది ముఖస్తుతియేయని తలంచితివా?

(తెరలో)

కావేరి! కావేరి! మీమహారాజుగా రెచ్చటనున్నారు? మీదేవిగారగు కౌసల్యామహారాణి శుద్ధాంతమునం దనుచున్నావా? సరే!

కౌస—నాథా! చెల్లెలు కైక యిచ్చటకే వచ్చినది.

దశ—(తనలో) ఈమె పలుకుచందము దలంప క్రోధఘూర్ణ మానమానసయయినట్లున్నది. శాంతింపఁజేయుటెట్లో కదా?

(కైక ప్రవేశించుచున్నది)

కైక—(తనలో) ప్రాణేశ్వరుండు కౌసల్యాంతఃపురమునుండి నాకడకు రాలేదు. మధురమాటలంబట్టి చూడగా నీమహారాజు కౌసల్యాలోలుఁడై యున్నట్లు తోచుచున్నది; అయినను నేను స్వయముగా వచ్చినప్పుడైన నీయన నాతో రాకుండునా ?

(సమీపించుచున్నది.)

కౌస—ప్రాణేశ్వరా ! చెల్లెలు వచ్చినది. స్వాగతమీయరేమి?

దశ—(అప) దేవీ ! కేకయరాజపుత్రికలుకఁ గల్పించుమాటల నాడకుము.

కౌస—(అప) నేనన్న యీమాటయందేమి తప్పున్నది?

కైక—ప్రాణేశ్వరా ! నమస్కారము. అక్కా ! కౌసల్యాదేవి! వందనము.

కౌస—సౌభాగ్యమస్తు. చెల్లెలా! రాకరాక నాయంతఃపురమునకు నిన్నుఁ దోడ్తెచ్చిన కారణ మేదో సామాన్యమయియుండదు. కూర్చుండుము.

కైక—కారణము కల్పించువారున్నప్పుడు కారణములకేమి కొదువ.

దశ—దేవీ ! కదలలేనిస్థితిలోనున్నదాన వంతః పురమును వదలి యింతదూరమేల వచ్చితివి.

కైక—ఇంతదూరమేల వచ్చితివని యడిగెదరేమి? మీరెఱుంగకున్న మీపట్టపుదేవి యయిన నెఱుంగదో?

కౌస—చెల్లెలా! నీకు స్వభావము కావున నట్లనుకొందువు గాని మే మెఱింగియు నిన్ననుటకు కారణము లేమియున్నవి.

కైక—ఏమి! నాకు స్వభావమగుటకు నేనెవ్వరికేమి హానిచేసితిని. నేనంత దుస్స్వభావనని యొక గా నీయభిప్రాయము?

కౌస—అమ్మాయీ! కోపపడకు. ఇప్పుడు నీస్వభావమును నేను నిందింపలేదు.

కైక—అమ్మాయీ! కోపపడకుమని నీవు నాకు చక్కట్లు దిద్దనక్కరలేదు. నీవు పరమశాంతస్వభావురాలవును, నేను పరమక్రోధస్వభావనని కాఁబోలును నీతలంపు. మనమన తారతమ్యము లెన్నుటకు మనమే సమర్థులముగాము. లోకమున్నది.

(అనుబంధము 23)

కౌస—అవును. మన తారతమ్యంబు లెవ్వరెఱుంగరు? మనపరాక్రమము దేవలోకమునకుఁ గూడఁ బ్రాకిపోయినది కాదా? స్త్రీలకు సహజముగా నుండవలసిన లజ్జాభిమానములను వదలిపెట్టి రాక్షసులతో భూతములతోఁ దగవులాడుటకు "తగుదునమ్మా" యని కచ్చబిగించి కత్తిగట్టి యెప్పుడు సిద్ధమైతిమో యప్పుడే తెలిసిపోయినది. నీవు వేరుగా చెప్పుకొనవలయునా?

కైక—నేను నీవలె చేతగానిదాననై యింటఁగూరుచుండి యేకు లొడుకుకొనుచుండుట లేదు. సమర్థురాలను గనుక మహారణమున నిలచి యుద్ధము చేసి భర్తగారి ప్రాణముం గాపాడితిని. నీకా తెలివియును శక్తియు లేనందులకు నీనిర్భాగ్యతకు నీ వేడువవలసినదే కాని నేనేమి చేయఁగలను.

కౌస—(రోషముతో) ఏమి! నేనేడువవలయునుగా? ఓసి దుర్మార్గురాలా! నీకెంత గావరమున్నదే; నన్నేడ్పించెదవుగా? నిండునట్టింట నేడ్పుతిట్లు తిట్టెదవా రాకాసి.

కైక—అసిపించుకొనుటకభిమానముగు వారొకరి నన నేకూడదు. ఆయూరికీ యూరు నంతే దూరము.

(అనుబంధము 24)

దశ—సుందరులారా! మీరిట్లు తగవులాడుకొనిన లోకు లేమనుకొందురు. ఒక్కరికైనను శాంతముండనక్కఱలేదా?

కౌస—అవును. శాంతము మాకెక్కడిది? శాంతమునకు మీ యితరదేవేరులది పెట్టినది పేరు. కలహములకన్న నాకేమియనియున్నవి.

కైక—అవును. ఆమాట నీవు చెప్పనక్కఱలేదు. మహాశాంతురాలనని నీకు గర్వమున్నదిగాని నీకన్న ముక్కోపి వేరొక్క తెలేదు. తన తప్పు తనకు తెలియదు.

కౌస—అదియే తెలిసియున్న నింతకలహమునకుఁ గారణమే యుండదు.

కైక—కలహమునకుఁ గాలుదువ్వుటకు నీవుండనేయుంటివి గాదా?

కౌస—ఎవరు గాలుదువ్వునదియు నాథునకే తెలియును.

కైక—తెలిసియున్న దగ్గరనుండి నన్నుదిట్టించునా?

కౌస—నిన్నా తిట్టించినది నన్నా?

కైక—నిన్నేల తిట్టించును? నీవు పట్టపుదేవివి; గారాబుభార్యవు; మూఁడుదినముల నుండియు, వంతుదినముగడచినదైన గుర్తెఱుంగక నేకచక్రాధిపత్యముగ చెట్టపట్టములు వైచికొని నీతో కులుకుచున్న దశరథమహారాజుగారేమి కౌసల్యామహారాణిగారిని తిట్టించుటయేమి!

కౌస—ఈవగలకేమిలే. మగఁడు నీవశుమయినప్పుడు ప్రేమలేని వట్టి శరీరమెచ్చుటనున్న నేమి?

(అనుబంధము 25)

దశ — దేవీ! కోసలరాజపుత్రీ! నీవయిననూరకుండరాదా?

కౌస — మెత్తనిదాననగుటచేత మీరును తప్పులేసి నన్నే దూషింపుచున్నారు.

దశ — దేవీ! కేకయరాజపుత్రీ! నీవయిననూరకుండరాదా?

కైక — మీముద్దులభార్యనన లేక నన్నందురేమి? మీపక్షపాతముచేతనే యీమె నోరెఱుఁగని నాపైకి పట్టపుదేవినను గర్వమున నల్లేరుమీఁదికిబండి వెళ్ళునట్లు చేతులెత్తుకొని తిట్టవచ్చుచున్నది.

దశ — హా! దైవమా! ఈయవస్థ శత్రువులకైనను కూడదుగదా?

చ. ప్రియముగ సర్వసాగరవరీతమహీతలమేలవచ్చు వి
స్మయముగురీతి నాజిరిపుసంతతులం బరిపూర్ణవచ్చు సం
శయరహితంబుగా శశివిషాణమునుం గొనవచ్చుగాని ని
శ్చయము; సతీవిరోధముల నీరజగర్భుఁడు మాన్పలేఁడిఁకన్.

(తెరలో)

మహారాజా! నారదమునీంద్రులు వచ్చి దర్శనమపేక్షించుచున్నారు.

దశ — (విని) సేవకా! శీఘ్రముగా వారిం బ్రవేశపెట్టుము. దేవేరులారా! మహాత్ముఁడగు నారదుఁడు వచ్చియున్నాఁడు. ఇప్పుడయినను మీకలహములనుమాని సంతోషముగా మాటలాడుకొనుఁడు.

కైక — నావలన తప్పేమున్నది?

కౌస — నావలనమాత్రమేమి తప్పున్నది?

దశ — సతులారా! మీయిరువురివలనం దప్పులేదు. తప్పంతయు నాయందున్నది. నన్నయినను క్షమించి కలహములను మానుఁడు

(నారదుఁడు—ప్రవేశము)

నార—(తనలో) ఆహా ! ఎంతలో భూలోకమునకు వచ్చితిని.

మ. తోలుతన్నిరజగర్భుఁజూచి యటుపై సుర్వారమార్తాండమం
డలముందాటి రమారమనోహరునికోటంజొచ్చి సేవించి యా
వలదేవేంద్రపురంబు గన్గొని యుమాప్రాణేశుదర్శించి భూ
వలయాధీశ్వరుఁబంక్తికంధరవిభుం బన్నాంబుగాఁ గాంచితిన్.

ఒకమారు భూలోకవార్తల సరయుదమాని పంక్తిరథునిపురంబు నకుగా నీతఁడంతఃపురమునందున్నాఁడే!సరే! యుక్తుడే, ఈతనిదర్శించెద. ఇది యేకదా పురుషునకు వినోదవేళ.

సీ. నవ్యసర్వంసహా పాలనమునకన్న
విమలనిజదేవతాదర్శనమునకన్న
నితరసుఖకార్యవితతులెన్నింటికైన
సతులసాంగత్యమే పురుషార్థమవని.

దశ—సురముసీంద్రా ! నమస్కారము. ఈమణిపీఠంబలంకరింపుఁడు.

నార—సుపుత్రప్రాప్తిరస్తు.

కౌస—
కైక— } దేవా ! నమస్కారము.

నార—దేవాంశగల పుత్రులంగనుఁడు.

దశ—బ్రహ్మమానసపుత్రులగు త్వాదృశు లేదో కారణము లేక రారు. అదేమయియుండునో?

నార—రాజా ! కారణమేమియుండును. త్రిలోకసంచారినగు నేను భూలోకవృత్తాంతములను సయిత మరసి పోవుదమని వచ్చితిని. కాని, దక్షిణనాయకుఁడవగు నీకేదో యంతఃపురాభియోగతీర్మానము వచ్చినట్లున్నదే?

కౌస—(తనలో) అయ్యో! ఈతనిమొదట నయితము మా తగవు బయల్పనునాయేమి?

కైక—(తనలో) ఈనారదుండు మాతగవులు విననేని త్రిలోకాధీశ్వరులభార్యలకడ మాజగడాలమారిగుణముల, నేకరువుపెట్టక పోడు.

దశ—నారదమునీంద్రా! ఈదక్షిణనాయకత్వము కడుంగడు దుస్సహమయినది గదా?

సీ. విమతభంజనలోకైకవీరులైన
వనజభవసమపండితవర్యులైన
సాంద్రవనములనుండు మునీంద్రులైన
మానినులపొంత పురుషులు బానిసీలు.

నార—దశరథా! నీవు వచించిన లోకవృత్త మతిసమంజసముగానున్నది. కాని, సద్గుణగరిష్ఠలై కోసలకేకయరాజవశంబులం జనియించిన యీసతులు నయితమేదేని తగవులాడి నీకు మనస్తాపమ్ముంగూర్చి తమకీర్తికి భంగముందెచ్చుకొనందలంచుట లేదుగదా?

దశ—(తనలో) ఈనారదుండు కలహాశనుండయ్యును నేండేలనో కలహాంతమొనర్చునట్లు చక్కగా మాటాడినాండు.

కైక—(తనలో) ఈనారదుండు మాకు గట్టిగా బుద్ధిచెప్పినాండు.

కౌస—(తనలో) ఇంకను తగవులాడినచో దుష్కీర్తిపాలగుదుము.

నార—దశరథా! మాటాడవేమి? నీసతులపై నలుకయింకను తగ్గలేదా?

దశ—మునీంద్రా! అన్యోన్యకలహప్రియులయియున్న యీతరుణీలోకమునకు కలహమునకుం గారణములు గావలయునే?

కౌస — చాలు చాలును లెండి. ఇచ్చట నన్యోన్యకలహప్రియుల యియున్న వారెవ్వరు? చెల్లెలగు కైకపై నాకేమి కోపము మునీంద్రా! పరిహాసప్రియులగు ప్రాణేశ్వరునిమాటలను లెక్క చేయకుఁడు.

కైక — అక్కగారగు కౌసల్యాదేవియు నేను నేదో కొంచెము వట్టింపుగా మాటలాడికొనిన దానిని ప్రాణేశ్వరుండేదో పెద్దకలహముగా వర్ణించి చెప్పిరి. కాని మేమేమియుఁ గలహించుటలేదు.

నార — సెబాసు దశరథా! సెబాసు. అట్లయిన నీవే ముఖ్యుఁడు కలహప్రియుఁడవుగాఁ దోఁచుచున్నావు నాపాత్రమును నీవు ధరించినావా యేమి?

దశ — (అహ) మహాత్మా! ఎట్లయిన నీయువతులు సమాధానపడినదే చాలును.

నార — అమ్మా! మీయిరువురకుం గోపము లేదని చెప్పితిరి గదా? ఆనందములో నాయెదుట నొక్కమారు మాటాడుకొనుఁడు.

దశ — కోసలరాజపుత్రీ! మాటలాడుము.

కౌస — నావలన నేమి తప్పున్నది? నేను మాటాడను..

కైక — నావలన మాత్ర మేమితప్పున్నది. నేనును ముందు మాటాడను.

దశ — మునీంద్రా! వింటిరిగదా!

నార — దశరథా! ఇది వీరికిఁగలక్రోధముగాదు. మరేమంటివా! విను.

గీ. ఏకపత్నీధవుండు నాయికకుఁగల్గు
ప్రణయకోపంబునకుఁ దానె పాలువడును
బహుసతులుగల్గిరా భర్తపైనఁ గల్గు
ప్రణయకోపంబు సవతులపైన దొరలు.

దశ—మునీంద్రా! బ్రహ్మచారులయినను దమరెంతయనుభవముగా సెలవిచ్చినారు!

నార—(అప) రాజా! అలౌకికులమయ్యు మేము లౌకికులమే సుమా! వీరిని మాటలాడించుటయు నాకొక కష్టముగాదు. వీరికి నేను స్నేహముంగలిగించెద నుండుము. (ప్రకాశముగా) అమ్మా! కోసల రాజనందినీ! వత్సా! కేకయరాజపుత్రీ! నేను మీయిరువురికొకమహా వరమీయఁదలచినాను; కాని, మీరాగ్రహంబు వదలుటలేదు.

కౌస—సురమునీంద్రా! మాకేమియు క్రోధము లేదు.

కైక—బ్రహ్మమానసపుత్రా! ఆగ్రహమువిడిచి చాలకాలమయినది.

నార—అటులయిన మీలో నెవ్వరు ముందు మాటలాడెదరో వారికి వరమిచ్చెదను.

కౌస—చెల్లెలా! కైకా! } (యిద్దఱు నొక్కమాఱు
కైక—అక్కా! కౌసల్యా! } పిలచుకొందురు.)

నార—(పెద్దపెట్టుననవ్వి) రాజా! ఇందువారు దురాశాపాతకులుగదా!

కౌస—(సిగ్గుపడి తనలో) ఈమునీంద్రుఁడు మాకు చక్కగా బుద్ధిచెప్పినాఁడు.

కైక—(సిగ్గుపడి తనలో) ఏమి యీమునిమాయ!

దశ—మునీంద్రా! మీసామర్థ్యము మెచ్చవచ్చునుగదా! నేనెంతబ్రతిమాలినను వినని వీరివైరమును క్షణములోఁ జల్లార్చి మాటలాడించితివి! అయిన వీరిద్దఱొకేమాఱు మాటాడుటచేత నిద్దఱును వరమున కర్హులు.

నార—దైవబలముగల మీకిప్పుడు నావరము లనవసరములు. అయినను వినుఁడు! అమ్మా! కౌసల్యా! తల్లీ! కైకా!

సీ. నిర్మల కాదంబినీమాలికలఁ గేరు
గంభీరమగు తను కాంతితోడ
లలితంబులై జానువులదాఁకు దృఢమయిన
యుజ్జ్వలదీర్ఘ బాహువులతోడ
విలసితశతపత్రముల కాంతి బురుడించు
విమలసుందరవదనములతోడ
భానుకోటిప్రభాభాసమానం బైన
సంస్తవనీయ తేజములతోడ
గీ. ప్రజల శాసింపఁదగు పరాక్రమముతోడ
జలజనాభుని దేవతాంశములతోడ
దనుజనాశనశిష్టరక్షణముకొఱకుఁ
గాంచెదరుగాక సుతుల మీగర్భములను.

(దీవించుచున్నాఁడు.)

కౌస—దేవమునీంద్రునివరము లతిప్రీతికరములు.

కైక—మా కింతకన్న నర్థింపఁదగినవి లేవు.

నార—మఱియు నోదశరథా! సుమిత్రాపురంధ్రియందు, కైకా, కౌసల్యానందనులకుఁ గూర్చు పుత్త్రులిరువురుగలుగుదురు.

దశ—మునీంద్రా! ఇప్పుడు మీవలన సూర్యవంశము గ్రహింపఁబడినది.

నార—మహారాజా! కొంతతడవు సభామందిరమున సిష్టగోష్ఠి సల్పుదము. రమ్ము!

దశ—మహాప్రసాదము. (నారదునితో నిష్క్రమించుచున్నాఁడు.)

కౌస — చెల్లెలా! ఇంతకును నీవు వచ్చినపని చెప్పితివిగావు.

కైక — అక్కా! మఱేమియు లేదు. నాథుఁడు రెండునాళ్ళనుండి యుఁ గాన్పింపమి బెంగఁగొని వచ్చితిని.

కౌస — చెల్లెలా! ఈస్వల్పకారణము నీకు నారదదర్శనముం గలిగించినది. నాథుం డేతెంచుదనుక మన్మందిరచిత్రములం జూతము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)





# శ్రీ రామ జననము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము:—దశరథాంతఃపురము.

కౌసల్యా—దశరథుఁడు

దశ — దేవీ! కౌసల్యా! నేఁటి నిస్థితిఁ జూడ నాకించుక భీతి గల్గుచున్నది.

చ. కుదురుగ చంపకప్రతతిఁ గూర్చున శోకము భాతిఁ జారుని
రదములఁ దేలు భాస్కరుని రక్తిమ నచ్ఛసరోవరాంతరా
స్పదమగు పుండరీకమటు పద్మినిరో! ధనశాంతిశోజ్జ్వల
స్మృదుపరియంకపేమను సహించెదు క్రోధముహారుణాక్షివై.

కౌస — (ఆవేశముతో) రాజా! నాతోడ సంభాషింపవలదు. నాకీదినముననేమో నీమొగముం జూచుటయే సున్నహముగానున్నది. శరీరమంతయు భారమై తాపమున భగభగ మండుచున్నది.

దశ — దేవీ! నీకీదినమున నిదేమై యుండును?

కౌస — (ఆవేశముతో) ఇది యేమైయుండునా? హా! పాపాత్ముఁడా! నీవెఱుంగవుగా! ఇది మహాప్రలయకాలము. క్రూరదానవ సంహారకాలము—దైత్యరాడ్గర్భనిర్భేదక ప్రచండమగు మాతృక్రీడా

గ్నిజ్వాలలు కాహుతిగాక దూరముగాఁ దొలఁగి చనుము. తమ్ముఁడా! లక్ష్మణా! ధనుస్సు—ధనుస్సు! రావణా! నిలు—నిలు! విభీషణా! నీవడ్డము రాకుము— ప్రభాకరనిశాకరతారకాగణసంక్షోభకారణము గు బ్రహ్మాస్త్రమిదిగో!—భయంకరముగా నత్తితిని! లోకమాతను సీతను దెచ్చిన పాతకి యీ దశకంఠుఁ డేడీ! లంకాపురవినాశముం జూడఁ దలంచితివిగా! రావణా!—హుం!—రే!—లోకకంటకా!—చచ్చితివిరా!—

(ఆగ్రహముతో దశరథునిపైఁ బడుచున్నది.)

దశ—హా! హా! సతీమణీ! ఏమిది! ఏమిది!

కౌస—(ఆవేశముతో) రే! రావణచండాలుఁడా! దేవానీక కాంతారమహాదావానలా! చచ్చితివిరా! లక్ష్మణా! లక్ష్మణా! రే! రావణా!

(మూర్ఛిల్లును)

దశ—దేవి! దేవీ! కోసలరాజపుత్రి! కౌసల్యా! ఏమిది! మాటాడవు? ఇదేమి యీ వేశము? ఇదేమి యసందర్భసంభాషణము? ఇదేమి యీగడము? లెమ్ము! ఇట్లు వివశవై వట్టి నేలం బడిపోతివేమి? ఆహా! ఏమిచిత్రమిది! ఈసతి యెంతకును లేవకున్నదే?

(తెరవంకఁజూచి) కావేరీ! కావేరీ!

కావే—(ప్రవేశించి) మహారాజా! ఏమిసెలవు?

(కౌసల్యవంకఁజూచి)

ఏమిది! ఏమిది! దేవిగారు—దేవిగారు—

దశ—దేవిగారేమో యసందర్భము లాడుచు క్రింద పడిపోయినది. సత్వరముగా వశిష్ఠభగవాను నిటకుఁ బంపి యరుంధతీదేవితో నీవృత్తాంతమును వచించి తోడ్తెమ్ము.

కావే—అయ్యో! దేవిగారు క్రిందఁబడియున్నారు.

దశ—దేవిగారికి నేను విసరెదను. నీవు సత్వరముగా నేఁగుము.

కావే—చిత్తము.

(నిష్క్రమించును)

దశ—(విసరుచు) ఆహా! ఈదేవి కీస్థితి నేఁడేటికిఁ గలిగె?

సీ. వైష్ణవతేజమీపద్మాయతాక్షి న
మ్మోగముగా నద్భుతమూర్తి దాల్చె
రావణదనుజవైరప్రసూచితవాక్య
వితతిభీభత్సమై వెడలఁ దొడఁగె
పద్మాక్షి యనుచుఁ దోఁపఁగనీక నెమ్మోము
విలయకాలాంతకవిధముఁ జూపె
బ్రహ్మాస్త్రమునుబూని ఖండనంబొనరించు
పగిది నేమేమియో పలుకఁదొడఁగె

గీ. కాంచఁగా నిది యనృతంబు గాదు కలికి
గర్భమున దైవతాంశావికాసమైన
తేజమేదియొ గూఢమై తెలియరాక
నీగతిని తీవ్రముగ వచియించె నిజము.

(వశిష్ఠుఁడు ప్రవేశము.)

వశి—దశరథా! ఏమది?

దశ—మహాత్మా! ఏమి చెప్పుదును? ఏదియో మహావేశము గల్గి యీసాధ్వి క్రోధపరవశయయి రావణా యనియు ధనుస్సు ధను స్సనియు, లక్ష్మణా యనియుఁ బల్కుచుఁ దుదకు మూర్ఛిల్లినది.

వశి—(చిఱునవ్వునవ్వి) భయములేదు. విచారింపకుము. నీకు శ్రీమహావిష్ణునంశమున రావణసంహారమొనరింపఁ గలసుపుత్రుఁ డీ

కౌసల్యాదేవియందుదయము మందఁగలఁడు. తదవతారమునందలి భావి చరిత్రమే యిప్పుడు సూచింపఁబడినది.

దశ—ఈసతి కీ క్రోధమేమి?

వశి—రాజా! ఇది క్రోధము కాదు. ప్రసవసమయ మగుట చేత శ్రీవిష్ణుతేజమంతయు నొక్కమారుగా గర్భస్థుఁడగు బాలునియం దావేశించినకతమున నీబాల వానిని భరింపలేక పలికి పడిపోయినది.

దశ—దేవా! ఇంతేకదా!

వశి—సంశయము లేదు. పునర్వసునక్షత్రమును ప్రవేశించుచున్నది. నీకు సుపుత్రప్రాప్తియగుకాల మింకొకఘడియలో నున్నది. మనము జాగరూకతతో నుండవలసినదే.

దశ—దేవా! ఈసతి యింకను లేవకున్నదిగదా!

(కావేరి ప్రవేశించుచున్నది.)

దశ—కావేరీ! భగవతి యరుంధతి యెక్కడ?

కావే—దేవా! ఆమె వచ్చి యావలిమందిరమునం దున్నారు. ఆఁడువారుతక్క మగవారుండఁదగినకాలము గాదనియు, మీరందఱు నావలకుఁ బోవలసినదనియు నామె యాజ్ఞాపించి కస్తూరి మొదలయిన వేడిపదార్థములను సేకరింపుమని నన్నంపినారు.

వశి—ఇంక సందియము లేదు. ప్రసవవేళయందు మనముండ రాదు.

కావే—దేవిగారు కన్నులు తెఱచినారు

కౌస—(కన్నులువిప్పి లేచి) కావేరీ! కావేరీ!

కావే—అమ్మా! అమ్మా! శరీరము నెట్లున్నది?

కౌస—కావేరీ! నేనిట్లు పడియుంటినేమి? ఏమి జరగినది?

వశి—(అప)దశరథా! ఈబాలకు జరిగినదేదియును జ్ఞప్తిలేదు కావున, తెలియనీయకుండుటయే శ్రేయము.

దశ—చిత్తము. (ప్రకాశముగా) దేవీ! ఏమియును లేదు. కావేరిసహాయమున నంతఃపురమునకుం బొమ్ము.

కావే—అమ్మా! మూర్ఛవచ్చిపడిపోయితిరి. శరీరమున దెబ్బలు తగిలినవా తల్లీ?

కౌస—శరీరమున దెబ్బలేమో కాని, (సిగ్గుతో) కడుపున నేమో సంకటముగా నున్నది.

వశి—కావేరీ! దేవి నరుంధతికడకుం గొనిపొమ్ము.

కావే—చిత్తము.

(కావేరి కౌసల్యతో నిష్క్రమించును.)

వశి—దశరథరాజేంద్రా! నేఁడుగదా సకలలోకముల కానందదినము.

సీ. కౌసల్యయును నిన్ను కడుపునఁ గనుటకు
తొలినేమహాపూజ సలిపినారో !
భూపాలునిగాఁ బూజించుట కయోధ్య
పౌరులేవరములఁ బడసినారో!
మనసారగా విద్యలను నేర్పి ధన్యతఁ
గాంచ నేనేమిగావించినానో!
ప్రాణేశ్వరునిగాఁ బడయుట కవని నే
వెలఁది యేతపము గావించినదియొ

గీ. విశ్వమూర్తియైన విష్ణువు జిష్ణుండు
భూతలంబునందుఁ బుట్టుటకును
పాకనేమిమీఁద బహువత్సరంబు లీ
పుడమి యే తపంబు సలిపినదియొ.

దశ—మహాత్మా! ఆనందోద్రేకమున నాశరీరమంతయు వణఁకుచున్నది. నే నిప్పు డేమిచేయవలయును?

వశి—దశరథా! వినుము.

సీ. అనఘ! సుపుత్రోదయం బైనవెంట నం
చితశుచిస్నానంబు సేయవలయు
ధనధాన్యములను, గోదానంబులను, భూమి
దానాల విప్రుల దనుపవలయు
చెఱలలో నిడినట్టి చిరదోషులను గూడ
ప్రీతి నిప్పుడు విడిపింపవలయు
లక్షసంఖ్యయగు సాలగ్రామములకు
క్షీరాభిషేకంబు సేయవలయు

గీ. సకలదేవతలకు నాత్మశాంతికొఱకు
చిరము బహుళాన్న దానంబు జేయవలయు
మితివచింపఁగ నేటి కోమేదినీశ
చేయఁదగు సత్క్రియల నెల్లఁ జేయవలయు.

దశ—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

చతుర్థాంకము.

సంపూర్ణము.





# శ్రీ రా మ జ న న ము.

## పంచమాంకము.

ప్రథమరంగము. అయోధ్యాపురములోని వీధి.

(కావేరి, మధుర చెఱియొకవైపునుండి ప్రవేశము.)

కావే—మధురా! నా దేవికి నల్లనిబిడ్డ? డని పరిహాసించితివేకి మీ దేవికింగూడ నల్లనిబిడ్డఁడే పుట్టినాఁడఁట గాదా!

మధు—అవునమ్మా! అదేమిపుణ్యమో గాని, సుమిత్రాదేవి మామిడిపండ్లవంటిబిడ్డల నిద్దఱింగనినది. నా దేవిగారికిని, మీ దేవిగారికిని నీలములవంటి రంగుఁగలపిల్లలు పుట్టినారు.

కావే—మధురా! శరీరవర్ణములు నీలములుగా నున్న నేమి? మా కౌసల్యకుమారుఁడు శ్రీరామచంద్రునిఁ జూడు! చంద్రునివంటి మొగము, తామరపూలవంటికనులు, మోకాళ్ళవఱకు చేతులు, నల్లని నెఱికురులు, విశాలమైన ఱొమ్ము, ఆహాహా! నవరత్నములు రాలు నవ్వు. ఆకుమారు నెంతచూచినఁ దనివితీర దే.

మధు—మా కైకకుమారుఁడు భరతుఁడో—అందము తక్కువవాఁడా? ఆకలువపూవులవంటికన్నులు, తామరపూవువంటి నెమ్మొగము, నూవుపూవువంటి ముక్కు, యర్ధచంద్రునివంటి నెన్నుదురు, ఆహాహా! ఎంతసేపెత్తుకొన్న నింకనుముద్దాడనే మనసగును. అవును గాని—కావేరీ! మామంథర యిద్దఱుపిల్లలను దగ్గరనుంచి చూచినదట అప్పుడు భరతుఁడే రామునికన్న నమిత సుందరముగా కనుబడెనని చెప్పినది నిజమేనా?

కావే—పాపముండ. మంధర కేప్పుడు నిటువంటిబుద్ధులే! చావగాచకొన్న ముండ కీకతుపాతపుమాటలెందులకో. రాజుగారి నలువురుకొడుకులు నందముగాలేరా! సుమిత్రి కొడుకులు లక్ష్మణశత్రుఘ్నులు మాత్రి మందము తక్కువవారా? నలువురి నొకరి కొకరు తీసిపోవనివారే. అందుల కీముండ కీకతుపాతమెందులకో ? రాముని తక్కువ, భరతుని యెక్కువ చెప్పి నాలుగిచ్చకములాడి కైక తన కేమో త్రిప్పి తలకెత్తునని ముండ యుబలాటము.

మధు—పోనీ. దానిమాటలకేమి లే! కాని నీవిప్పుడెక్కడకుం బోవుచున్నావు?

కావే—ఈదిన మిరువదియొక్కటిగదా! ముత్తైదువలకు పసుపు గంధము తీయుటకై దివాణములోని పెద్దసానదగ్గఱకు.

మధు—అట్లయిన నీవు శీఘ్రముగా నిపనియం దుండుము బాలురను డోలికలోనుంచువేళ కావచ్చినది.

(ఇద్దఱు చెఱియొకవంకకునిష్క్రమింతురు)

---

ద్వితీయరంగము. అంతఃపురమున చావడి

(కౌసల్య, కైక, సుమిత్రి, ముత్తైదువలు బాలురను డోలికలలోనుంచి)

కౌస—అమ్మలారా! ఈబాలురను నిద్రయూపుదము, రండు.

(అనుబంధము 23)

ముత్తై—దేవిగారి యిష్టమువచ్చినట్లు.

(అందఱును డోలికలఁబట్టి యూపుచున్నారు)

క. జో జో శ్రీరఘునాయక
జో జో పద్మాయతాక్ష జోజో రామా
జోజో ముద్దులబాలక
జో జో యినవంశలోల జోజో బాలా.

సంపూర్ణము.

# శ్రీ రామ జననములోని పాటలు.

(1) అనుబంధము

పూరి — ఆదితాళం

శైక — నాప్రాణేశా నను దయగనుమా। భూపాల మేలుగనుమా॥ నాప్రా॥

దనుజులుగ్ర మృత్యులైరిగా ॥నాప్రా॥

తీవ్రశరంబుల దీప్తి నసురులన్ జావగ గాంచితిమించగా॥నాప్రా॥

నిష్కంటకముగ నిర్జరవరసౌఖ్యంబును గాంచగలైగా ॥నాప్రా॥

(2) అనుబంధము.

శహాన — రూపకం

దశ — కలికీరణమున నెంతటగాసి నొందితివో ॥కలి॥

బలహీనములైన కోమలబాహు యుగ్మముతో నెటుసలిపితివో ॥కలి॥

మదదానవ క్రూరదనాయక మార్గణంబులలో నెటుమెలగితివో ॥కలి॥

(3) అనుబంధము.

హిండోల్ — ఆదితాళము

దశర — తీతువు రీతి నెవ్వడో పలికెను తెలియగ జాలనిదేమి యశుభదమొ ॥తీతు॥

ఈతరి నామది నెటులోకలిగెను । యేకష్టములికను సంభవిలునో ॥తీతు॥

వనభూమికి పుత్రికుందు । జేరిన వారక నాజీవములు విడచినన్।
జనంబెల్లన్ ననువిడచినన్ । వరయుని డెదననుచు బలికితి
నిగా ॥తీతు॥

(4) అనుబంధము.

హిండోల్—ఆదితాళము

ముని బాలుడు—తల్లిదండ్రుల భజనమే । తనయుల కీలోకమందు
గతియే ॥త॥

తెల్లవారగనె దీవసల్ వడసి దేవుని చందంబున పూజింపన్।
కొల్లలుగ కందమూల తీర్థముల వసంబునను గొనిరావలయు
నుగా ॥తల్లి॥

యాగములకు నిత్యాగ్నిహోత్రముల ననుదినమును గృహ
మున గల్పింపర్ వేగము సిద్ధలేంధనముల గొనికుశాదు
లను సమకూర్పవలయునుగా ॥తల్లి॥

(5) అనుబంధము.

బీన్ ఫలాస్—త్రిశ్రగతి

దశరథ—ఆ హా హా హా హా । దీనరక్షకా ॥ఆహా॥
ద్రోహినైతి నాపావము బాపివేగబ్రోవుమా ॥ఆహా॥
మునితనయు మదేభమంచు మనమందు దలంచితిన్ । శ్రీర
మాధీశ్వరా। కావుమా శుభకరా। స్వవ్రికాశా। లోకాధీశ్వ
రా॥ ఆ హా హా హా హా॥

(7) అనుబంధము.

జంగ్లా—ఆదితాళం

దశ—వరమేశా శ్రీశా । కడుపాపినైతి ॥వర॥

యికనాసూర్యవంశఘనకీర్తి నాశనమా । మానినాథుడే మొన
ర్చుదోపదామె ॥పర॥
కనులు తెలియక గాఢశరమునన్ । మునితనయు బడనేసి
తిగా ॥పరమే॥

(8) అనుబంధము.

బ్యాగ్ — ఆదితాళము

వృద్ధ ముని—దురితమతీ । విన్నుతమింప గలనా ॥దురి॥
తెలుపు మెవ్వడవో । కలుషహృదయుడా ॥దురి॥
మోసగించి యేమరింతువానా । పుత్రరత్నమును । మునీంద్ర
సుతునిన్ । దునిమి యేమి సలిపినాడ వధమా ॥దురి॥

(9) అనుబంధము.

బ్యాన్ — త్రిశ్రగతి

మునిబా—ఆహాహా తీరని దుఃఖంబీహాదు మాకయ్యెన్ ॥ఆ॥
జీవంబుల్ విడుచుంటిక్ హాజననీ హాజనకా ॥ఆహాహా॥

(10) అనుబంధము.

శ్రీరాగము—త్రిశగతి

నారద—భజభజమానుతినుతనామా । కోదండరామ ॥భజ॥
అజరుద్ర సురేశకిరీటాలంకృతమణి మండిత । చరణకమలయు
గళ శశివిభాకర శ్రీకరలోచన । సుగుణాభయశంఖ చక్రశార్ఙ్గ
గదాలంకృతకర । శ్రీపత్న్యాంచిత తనుసేవిత సనకసనందన
॥భజభజ॥

(12) అనుబంధము.

బ్యాగ్ — త్రిశ్రగతి

దశర.—శివశంకరవిశ్వంభర । గంగాధరా । హేశూలాధరా । హే
శూలాధరా ॥శివ॥

(13) అనుబంధము.

ఆదితాళం.

దశర—ఆనందమయ్యెనా మానసమున ॥ఆనం॥

నారదుడొసగిన యా దేశంబున తీరని దుఃఖమునశియింపన్ ॥ఆ॥

నారాయణుడే నాగర్భంబున నుద్భవమొందునటన్న ౯ । హృదయమునందును । ముదము జెలంగెను । సర్వకలుషము లు హరించె౯ ॥ఆనంద॥

హేపాప విదూర కలుషహరణ శశిధరా। భువనసంచరణ। అసురసంహరణ । పరమపురుష । విగతకలుష । విబుధనుతా। శుభచరితా । రిపుహతా । మునిహితా ॥శివ॥

(14) అనుబంధము.

ఫీల్—ఆదితాళం

వేశ్యలు—ఇటనిలువక పోదము రారేమీ ॥రిట॥

పటురయమునన్ । హతభయమునన్ । పంక్తిరథేశ్వరు కార్యమున ॥ఇటు॥

అసమానంబగు ఆశ్రమమునకును । వేగమెజనియా । మునివరుబొడగన ॥ఇటు॥

చతురులగు మీచాతుర్యంబున । సంయమి విటునిగ నలుపగ తగుమీ ॥రిటు॥

(15) అనుబంధము.

కనకాంగి—నీనగలు వగలు నెవరెరుగని వికలు పలుకు లేలనవలా ॥నీనగ॥

చనుమవలా చాలునిటులా గులికెద వేల ॥నగ॥

ధరణి నాథులను ఫకీరులనుగా । నలుప గలుగు జగజంతపు

గా। తళుకులను బెళుకులను కులుకులను బరపెదవు । తెల
సెనిక । పలుగతుల ॥నీనగ॥

(16) అనుబంధము.

బ్యాగ్ — ఆదితాళము.

కనకాంగి— మేల్మేలు చాలు నీచమత్కారమూ యింతటిజగడము
॥మేలు॥

చాలుతే గుణములను ప్రకటించితి సదా నీ శృంగారమే జా
పితి ॥మేలు॥

నీలవేణి— శృంగారవతీ । మానవతీ । ధీరమతీ । యోషడతీ । ఆవల
జనవే॥

లలిత— లోకులు విన్నను సలసా । మీకిట తగవా కోమలులారా॥

కనకాంగి— సరిసరి । దీనివేషభాష లేమొ । రోషమేమొ । చూడ
నిమ్మ్మ । నీవటుబోమ్మా॥

లలిత— మదిని క్రోధ మేహితంబటే॥

కనకాంగి— ఎడలు గాచుకొనుమా॥

నీలవేణి— దుడుకు తనము విడుమా॥

లలిత— హితము వినుము । మీరవలజనుము॥

కనకాంగి— మేల్మేలు చాలు నీ చమత్కారము॥

(17) అనుబంధము.

బ్యాన్ — త్రిశ్రగతి.

ఋష్య— కృపాకరా దయాకరా । పరాత్పరా ॥కృ॥

నృపాలబాల నిర్మలానన మోస్తుతే । హేదుష్టదనుజ । నాయక
హాత । ధీనుతవినుతా ॥ సతంబునీ । పదంబులే । మాంకుశర
ణమొ ॥కృపా॥

(18) అనుబంధము.

బీన్ ఫలాస్—ఆదితాళం.

వేశ్యలు—కనుసఖియా । వనసోయగమమరె । సుందరముగను ।
సుందరముగను ॥కను॥
విరజాజులు మల్లెలు మొల్లలతో । విలాసయుతమై యొప్పెందరి
వనంబు । నుమించె । గనంగ। లతాంగులార॥కను॥

(19) అనుబంధము.

బ్యాగ్— ఆదితాళం.

ఋష్య—ఆహాహా యీ । పరమపురుషులను విస్మయముగ గంటిన్
క్షణములో ధరణిలో విస్మయముగ గంటిన్ ॥ఆహాహా॥
పావన తేజము భవ్యవిలాసము । పరివిమలమిచ్చోటా। గాంచ
గా పరివిమల మిచ్చోటా ॥ఆహా॥
విమలముగు తపోమహిమను గల్గిన ఘనఋషి సత్తములన్
జెలగగా గాంచగ గలిగెనుగా ॥ఆహా॥
జననముగాంచిన క్షణమెట్టిదో నా । కన్నులు తెరియించెన్
గనగ నాకన్నులు తెరియించెన్ ॥ఆహాహా॥

( ) అనుబంధము.

రేబన్ బిగ్ సరితకీపసమాలీ వలె ఆదితాళం.

కావేరి—ఎంతో దూరంత వే । జగజంతా ॥ఎంతో॥
హంతకారి తన ముందున సరి । కాంతలు లేరే నారీ ॥ఎంతో॥
వారివీరి శిఖలకు మాటిప్పు నెంతచాసవో కాని । తెలసెను
తెలసెను లేగయ్యారీ । సిచతురతలయు కాళీ ॥ఎంతో॥
మధుర—ఇక చాలును పో వేపగలాడీ ॥ఇక॥
పరికటిలముగ నిచ్చరముల బలుకగ ।తగుదువే కులుకులాడీ॥ఇ॥

గడుసుదానవని గర్వమునొందకు చెడెదవుగా కనుపాపీ । వింత గాను తడిగుడ్డలతో మా । గొంతుగోయకే ద్రోహి ॥౨౪॥

## (21) అనుబంధము.

త్రిశ్రగతి.

కావేరి—చమత్కారంబు చాలింపుమా । మాయలాడి ఓహోహో రంకులాడి ॥చమ॥

మధుర—ఛీరండ పోవె

కావేరి—ఓహోహోరంకులాడి ॥చమ॥

కార్యంబు రంకా । వాక్యంబు బొంకా

మధుర—ఛీఛీ నోర్మూయవే॥

కావేరి—మాయలాడి ఓహోహోరంకులాడి ॥చమ॥

మధుర—మహాశ్రీరంగ నీతుల్ మాట్లాడినావే । నీరంకు నీబొంకు నెవరెరుగరే॥

కావేరి—ఓహోహో నెంతురాలా । సిగ్గేలలేదే

మధుర—నీమాటనేపాటిగావింతునా

కావేరి—కులటా కులటా కులటా ఛీ మాయలాడి ఓహోహో రంకులాడి ॥చమ॥

## (22) అనుబంధము

బ్యాగ్—ఆదితాళము.

మధుర—పరుషంబుగదా । నిటులన్ । బలుకన్ । పరాక్రమా పేత యు కావేరియు ॥పరు॥

మదంబణంచెద మదించె చాలా । సమర్ధగాదలంచెగా సతం బు ॥పరు ।

దశరథేశ కోసలాత్మజలకిశ । వైరమ్ము మదిన్ సృజించ
దనుగా గెలచెదర । నిలచెదర । నిరోధముగ ॥పరు॥

(26) అనుబంధము.

శ్రీరాగం— రూపకం.

అందరు.—సుకుమారా । సుశరీరా । సుందరనగధీరా జోజో ॥సు॥
ప్రకటిత సుగుణాలవాల । భవ్యకళాఅఅఅ ॥సుకు॥
మదనమోహనమంజు భాషణా । మహిమతగుణశీలా । విధిని
భయకరా నిరంతర విమలకళా అఅ ॥సు॥



## — వైద్యగ్రంథములు —

| | |
|---|---|
| నాడీనక్షత్రమాల | 0- 4 |
| నాడీపరిజ్ఞానము | 0-6 |
| సుఖవ్యాధిచికిత్సాచంద్రిక | 0-12 |

## — హరికథలు —

| | |
|---|---|
| ॥నా॥మార్కండేయచరిత్ర | 0-12 |
| హరిశ్చంద్రోపాఖ్యానం | 0.12 |
| రుక్మిణీకల్యాణము | 0-12 |
| కీచకవధము | 1- 0 |
| అంబరీషోపాఖ్యానం | 0- 8 |
| ధ్రువచరిత్ర | 0- 8 |
| గజేంద్రమోక్షం | 0- 8 |
| సూర్యనారాయణశతకం | 0. 4 |
| సారంగధరనాటకం | 1- 0 |
| ప్రియంవదాచరిత్ర బి॥ బా॥ | 0- 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానం , | 0- 6 |
| సీతాకల్యాణము | 0- 8 |
| శ్రీకృష్ణరాయబారం | 0.10 |
| కబీరుదాసుచరిత్ర బా నా | 1- 0 |
| శ్రీరామజననం తో॥ వెం | 0-8 |
| జానకీపరిణయం డిటో | 0- 8 |
| అహల్యాశాపవిమోచనం | 0- 8 |
| మణిమాల శే॥అ॥ | 0.12 |
| తారాచంద్రీయం శా॥ వీ॥ | 0_12 |
| రసపుత్రవిజయం ఇ॥ య॥ | 1- 0 |
| రాణాప్రతాపసింగ్ డిటో | 0 12 |

## — ఆంధ్రనాటకములు —

| | |
|---|---|
| శారదావిజయం కొ॥ ॥వ | 0-12 |
| సామ్రాజ్యోదయం దో॥ సీ॥ | 0-10 |
| ముక్తావళి శొం॥ భ॥ | 0-12 |
| మాళవిక ము॥ చం॥ | 0-12 |
| సత్యాబాయి జ॥ ల॥ | 0-12 |
| భీమప్రతిజ్ఞ క॥ కో॥ | 0-12 |
| కబీర్ దాసీయము శ॥ రా॥ | 0.12 |
| సారంగధర వి॥సు॥ | 0-12 |
| కుశలవ డిటో | 0-12 |
| శ్రీనివాసకళ్యాణము దో॥సీ | 0-8 |
| ప్రతిజ్ఞాయాదవము అ॥సుం॥ | 0-12 |
| విచిత్రచిత్రమాల అ॥ పా॥ | 0-12 |
| నవరత్న చింతామణి డిటో | 1-0 |
| సంపూర్ణోత్తరరామాయణం | 1-4 |
| చతురచంద్రహాస దో॥సీ॥ | 0-8 |
| తులసీదాస్ కొ॥ స॥ | 1-0 |
| భక్తకబీర్ డిటో | 1-0 |
| లంకాదహనము కు॥ య॥ | 1-0 |
| రామరావణసంగ్రామం | 1-0 |
| సురాజుద్దౌలా జ॥ ల॥ | 0 8 |
| ప్రభాకర డిటో | 0-8 |
| సారంగధర ఆ॥నా॥ | 1.0 |
| జయంతజయపాలం ॥దో॥సీ॥ | 0-8 |
| మైరావణవధ కొ॥ వా॥ | 0-12 |
| తారాబాయి | 0.12 |

| | |
|---|---|
| సుగ్రీవ పట్టాభిషేకం | 0-12 |
| శ్రీరామనిర్యాణము జో॥ శి॥ | 0-8 |
| సంపూర్ణభారతం పిం॥ వ॥ | 1-4 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0-10 |
| పద్మవ్యూహము కా॥నా॥ | 1-0 |
| చింతామణి కా॥ నా॥ | 1-2 |
| చిత్రనళీయము ధ॥ కృ॥ | 1-6 |
| విషాదసారంగధర | 1-6 |
| ముక్తావళి | 1-4 |
| ప్రహ్లాద | 1-4 |
| చిరకారి | 1-4 |
| పాదుకాపట్టాభిషేకము | 1-4 |
| పాంచాలీస్వయంవరం | 1-4 |
| చంద్రహాస | 1 4 |
| సావిత్రీచిత్రాశ్వము | 1-4 |
| రోషనారా (శివాజీ) | 1 4 |
| బృహన్నల | 1-4 |
| వరూధిని | 1-4 |
| సౌగంధికం గుం॥ జ॥ | 0-8 |
| మాలతీమధుకరం బ॥స్వా॥ | 1-0 |
| శ్రీరామజననము దో॥సీ॥ | 0-8 |
| శ్రీరామప్రవాసము | 0-8 |
| శ్రీరామోద్యోగము | 0-8 |
| శ్రీరామవిజయము | 0-8 |
| శ్రీరామాశ్వమేధము | 0-8 |
| ఉషాపరిణయము | 0-8 |

| | |
|---|---|
| చంద్రకాంత చ॥ మా॥ | 0-10 |
| కన్యకాపరమేశ్వరీవిలాసము | 1. |
| సంగీతశశిరేఖ అ॥ చం॥ | 0- |
| సతీతులసి దో॥ సీ॥ | 1 |
| జయంతజయపాలం బ॥ కో॥ | 0 |
| కుశలవపట్టాభిషేకం రా॥ నా॥ | 0- |
| మహానంద | |
| అలీబాబా సో॥ రా॥ | 0- |
| సత్యహరిశ్చంద్ర రా॥ నం॥ | 0 |
| సంపూర్ణ రామాయణం | 1. |
| సావిత్రి. దో॥ సీ॥ | 0-1 |
| పాదుకాపట్టాభిషేకం | 0-1 |
| మారుతీవిజయం గు॥ కో॥ | 0-1 |
| సుమతీదేవి బ॥ కో॥ | 0-1 |
| సువర్ణపాత్ర రా॥ నా॥ | 1-0 |
| కనక్తారా నాటకం చ॥ కే॥ | 1-4 |
| సంగీత కృష్ణలీల సం॥ శి॥ | 1-0 |
| సంగీత విష్ణులీల చ॥ మా॥ | 1-0 |
| సంగీత గులోబకావళి-డిటో | 1-0 |
| బిల్వమంగళ చింతామణి | 1-0 |
| పాదుకా పట్టాభిషేకం | 0 12 |
| వేశ్యాహితబోధిని | 1-0 |
| వేశ్యామధురము | 0-8 |
| భక్తరామదాసు కే॥ శి॥ | 1-0 |
| పాంచాలీమానసంరక్షణ | 1-0 |
| సంగీత మార్కండేయ | 0-12 |

వలయువారు :— జనరల్ బుక్కుడిపో,

బెజవాడ, కృష్ణజిల్లా.